# ప్రభావతి

---

శ్రీకరంబు లగురత్నంబుల కాకరంబు లగు సముద్రములును, కనకం బాదిగాఁ గల్గు లోహములకుఁ దావలంబు లగుపర్వతంబులును, గలిగి సమస్తసస్యపుష్పఫలంబులకు జన్మస్థానం బైనయార్యావర్తంబున బహువిధరాజమందిరంబులకు నిలయం బై కైలాసకేళీగృహంబులతోడ స్పర్థ్యం బై, సకలమునిగణనివాసయోగ్యం బై, ధరాతలంబున కలంకారం బై యమరావతిం బురుడించు ద్వారక యనుపట్టణోత్తమం బొండు గలదు. ఆపురీవరంబున వాసుదేవుండు బంధుమిత్రులతోడం గూడి సకలవిధసుఖంబుల బడయుచు నారాయణావతారం బని పరిగణింపంబడుచుండు. ఆకాలంబున నాతనిజనకుండగు వసుదేవుం డొక యాగంబు నిర్వర్తింప నుద్యుక్తమానసుం డై పలుయుపకరణంబుల సమకూర్చి దీక్ష వహింప నున్నయవసరంబున పాకశాసనుండు లోకహితకార్యపర్యాలోచనంబున దామోదరునికై నాకంబు వెడలి నడతెంచుచు ద్వారకాపురంబు దవ్వులఁ గాన్పింపఁ దనవేయి కన్నులం జాలక వెలుంగుపడి యాపట్టపుసొంపునకు శిరఃకంపంబు సేయుచుండ నిలింపవల్లభుకీవిం బరికించి యంచితనయనారవిందంబుల నాసహస్రాక్షు నవలోకించి తదీయమాతుం డగుమాతలి యాతనితో నిట్లనియె. "దేవా! తావకీననయనచకోరంబు లీపురీతిలకంబును దిలకించి నివ్వెఱం గందుచున్నయవి. నాకస్వామికి నాశ్చర్యంబు గలుగఁజేయుపురంబిది గలిగియుండుట యెంత గాకుండునే? పడమటిదిశ నంభోరాశియుఁ గడమదిశలఁ గమనోజ్ఞపం బగువనచయంబును గప్పియుండు నీపురలక్ష్మి నవలోకింప దామోదరవ్యాపయావాసిని యగునిందిరచందం బన నింపు గుల్కుచున్నది. ఈపురప్రాంతంబులయం దుండెడు దునవసస్యంబుల పాఁతలచే పేర్పడుచున్న శ్యామాకారంబు దాల్చి యాకాశంబును గప్పి చూచువారికి నవమ్ముల కంబరంబున నున్నయభ్రరాజంబు లీపాపాసక్తియై సముద్రోదకంబును ద్రావ ఖండఖండంబులుగఁ జీలి పుడమికి దిగుచున్నచందంబున గన్పట్టుచున్నది. కోటలతెలుంగుఁ జూచిన నవతారమూర్తి యగుమహేంద్రుని బాయఁజాలని భోగిపతులెందఱో తమముల్లె నెల్ల కోటలుగ ఫణాపూగంబు సోధుప్పందంబుగ జేర్చితిరి యాహమాత్మంతో సుఖింప నీపురంబున కలంకారం బగునీతి నవతారంబు ధరించినట్టు

గాన్పించుచున్నయది. లేకున్న నీశృంగారం బెంతైన కలదా? చంద్రికాంతశిలాస్థాపితంబు లగు సౌధంబులును, కురువిందంబు లమర్పంబడిన కుట్టిమస్థలంబులును గలిగి యపూర్వశిలాపసంపద నొప్పారుచున్న యీపట్టణపుసొంపు గాంచిన యాంగీరసుండు నైతము వసంతాగమవిలాసంబులతోడ నొప్పు మామిడితోటయో లేక కళలచే నొప్పారుకోటయో యనుసందియంబు జెందకమానడు. నగరులపై నెత్తిన శ్వేతపతాకలు పవనవేగంబున వింతగ తాండవం బాడుచుండె. కోటబురుజులపై సైనికనివహము లనుక్షణంబును జాగరూకతతోఁ గంటిని ఱెప్పచందంబున గాచుచుండెం. అటనుండి కడను నడచువారికి వీడ వోసంగు తరువు లిరుప్రక్కల నున్నమార్గంబులును మధ్యమధ్య రమణీయంబు లగు విలాసగృహంబులును సమీపంబున సువాసనల నొసంగుపుష్పవృక్షసముదయంబును నందందు నలయికం దీర్చుకొనుటకు నున్నవేదికలును, నలుదిక్కుల సోపానంబుల నమర్చి నతటాకంబులం గలతామరలచెంగట విహరించు రాయంచలరొదంగు విడంబించుటచే నీరాజమందిరము రమణీయంబుగ విలసిల్లుచున్నది. ఈవీడు సమస్తశృంగారంబులచే ధరణీతటిల్లతచందంబున నున్నకారణంబున మేఘ మొకవేళ సిగ్గున నీపురంబునకు రాకుండినను భయంబు లేదు. ఏలన గంగాతరంగిణీజలం బపరిమితంబుగఁ బారి సస్యమును బోషించుచున్నది. కొలంత యేమి?'' అని యనేకవిధంబుల రథికసారథులు పరస్పరము నాయాస్తుతి సంపన్నకుతూహలంబున బహువిధములఁ బొగడుచు నాపురప్రాకారంబు నంగలొత్తి యుపవనంబున భూభాగంబునకుం దిగి పురంబులోనికిం జనుచున్నంత నాగరిరాజకుని నారాయణుండు తనప్రియసహోదరుం డగు సాత్యకిం బిలిపించి సువారిని నెదుర్కొని తోడ్కొని ర మ్మని యాజ్ఞాపించిన వాడును సముచితపరివారముతో నెదుర్కొని తోడ్కొని చన నల్లిబిల్లిగ నల్లుకొనిన కనకవల్లీమతల్లికలసొంపు పరికింపుచు నగరంబు ప్రవేశించి మార్గమధ్యంబున నిరుకెలంకుల నున్న సౌధంబుల ముందు విలాసినీజనంబులయొయ్యారం బులం గాంచుచు రాజమందిరద్వారసామీప్యంబుఁ జేరం జనునంత ననుజేశులరా మాదిరాజబంధువులతోడం గృష్ణుఁ డనేకమందిరంబులు గడచి ద్వారప్రాంతమునకు నెదురేగి సరససంభాషణంబులతో సభాభవనంబునకుం దోకొని చని యుచితాసనాసీనుం జేసి తక్కినవారల తమస్థానంబులఁ గూర్చుండ నియమించి నిజపీఠం బలంకరించి కుశలప్రశ్నంబు సేయు దామోదరు నవలోకించి ప్రద్యుమ్నుండు "దేవా! భవదీయముఖావలోక-

పలసినవస్తుసంచయం బెల్ల నాయిష్టానుసారముగ ననుభవించి యథేచ్ఛగ వ్యయపఱిచి రాచటికంబుఁ జేయక యొరుఁ డిచ్చునందాక తాలియుండు దైన్యంబు నా కేల? నీమంచి తనపునటనలచే మొగమోటంబున నూరకుంటిని గాని నీవృథాలాపంబులు నా కేమిటికి? తగవరి వైనయెడ నావాక్యంబు లాలకింపుము. మన మిరువురము కశ్యపబ్రహ్మసంతా నం బగుటచే నెంతకాలంబునుండి నీ వీనాకమును పాలించుచుంటివో యింతటినుండి నే నంతకాలముదనుక నేలుట పాడి. మనము కాశ్యపుల మగుటచే దేవదానవులకు జ్ఞాతిత్వంబు సహజంబు. నీ విదియంతయు నెఱింగినవాఁడవు గావున నీతుఁడంబ రాజ్యంబు మావశంబు గావించి యిటనుండి కదలి యెచ్చటికేనియు నరుగుము. అట్లు సేయవేని ని న్నిప్పుడ పట్టి మట్టుపెట్టెద. మీ దంభములను నాచేతిలోనివారల. నన్ను జయింప మీకు బలంబు చాలదు" అని వచించుపుణ్యజనునితో నింద్రుఁడు "సంహరించుట యన నేపా టిది? నీవును మేమును పరస్పర మైత్రిం గలసిమెలసి యుండుతెఱంగు యోజింపవల యునే కాని యిట్టిపలుకులఁ బలుకుట యుచితంబు గాదు. దానవేంద్రా! నీవు వచి యించినట్లు మన మిరువురము కశ్యపసంతతి యగుటంజేసి మనవివాదంబుల నెల్ల దీర్పఁదగినవాఁ డాతండె కావున నామునీంద్రునికడ కరిగి విన్నవింతము. ఆతండు నాకాధి పత్యమును నీకొసంగు మని యానతిచ్చినయెడ నొసంగెద నంతియె కాని కారణంబు లేని వైరంబుఁ గల్పించుకొని సంగరంబునకు డీకొనుటవలనఁ బ్రయోజనం బేమి? నాపలుకుల యందలినిక్కువం బారసి శాంతము వహించి మావాక్యప్రకారంబున నే యాతనికడ కేగి మనవివాదంబును దీర్చుకొనుట యుచితంబు గాని యూరకుండుట మేలు గాదు. తియ్య నినోటం జేదు మెసంగుట నీయట్టిగట్టివారికుఁ దగినపని కాదు." అని యనేకప్రకారం బుల వాతని మెప్పించి యొప్పించి సంతసించి బృహస్పతిముఖ్యులం గలసి యాపలునురక్కసి వెంటఁ గశ్యపుఁ డుండు నెలవునకుం జనిన నాపరమతపోధనుండు యజ్ఞదీక్షాపరతంత్రుఁ డై యుండుటంజేసి తనయుల నాసనంబుల న్నిలిపి తీర్చుటకు నియమించి దానవేంద్రుని సరస సంభాషణంబులఁ బ్రీతుం జేసి నీవిప్పుడు వజ్రపురంబున కరుగు మని యుద్యోగించిన సురవిరోధియు మహాసంతుష్టిశంబున నాపలుకుల కియ్యకొని యటనుండి కదలి నిజనివా సంబునకుం జనియె.

వ. మఱియు మన్మహానుభావనిర్మలచేఁ బలికినోటికంత విడివడ్డచందంబున నారా

భ్రమము. ఈపరిభాతంబున నాశ్చర్యరసంబున కాస్పదంబై మనంబున కానందంబుఁ గలుగఁజేయుచు మున్నెన్నఁడు విని కని యెఱుంగనదియు, నిశ్చయానిశ్చయంబుల నెఱుఁగ శక్యంబుగానిదియు నగునొక్కస్వప్నంబును గాంచితి' నని లజ్జచే సాంగంబుగఁ జెప్పక కప్పిపుచ్చఁ జూచినచందం బారసి యాచెలి, 'సఖియా! మనలో మన కట్టిరహస్యము లున్నను దాఁపఁ గూడ దని యొట్టిడుకొంటిమి గదా! యేల యట్టిరహస్యము నిక్కముల వచియింపక మొగమోటపడియెదు? మనకు భేదంబు గలుగుట విహితంబు గాదు. నుడువక తప్ప' దనిన, నాకనకాంగి యందుల కంగీకరించి తనకల సకలంబును నికలంబు గాకుండ సౌహార్దంబున నీరీతి వచియింపఁ దొడంగె.

“హిమవత్పుత్రి యగు హైమవతి యపారకృపాతరంగితమతి యై మందస్మిత సుందరవదనారవిందముతో నాస్వప్నంబున సాక్షాత్కరించి నన్ను జేరి ముద్దుఁ దనయంకముఁ జేరఁ బిలిచి దక్షిణహస్తంబున నామోము నిమురుచు 'నోతరుణీ! నీకు నొక్కచక్కని మన్మథునాకారుని మగనిగ సమకూర్చితి' నంచు వచియించుచు నొక్కచిత్రఫలకంబునందు విశేషరూపలావణ్యశౌర్యగాంభీర్యకారుణ్యాదిగుణంబులఁ గొమరొందు కొమరుప్రాయంపుఁ గోమలాంగుని గోరకదీర లిఖియించి, 'యీతండె నీవల్లభుండు. ప్రద్యుమ్నుం డను నాఁ బడుపరాక్రమవంతుఁడు. మాయావతీపురకు జనియించినప్రతుర్థిం డీపురంబుఁ బాలించు' నని పలుకుటయు, నేను నచ్చటిపెద్దలచేఁ బ్రేరేపింపఁ బడినదాననై యాయమకు వందనం బాచరించి యనిపినట్లు కలఁ గంటిని. ఆచిత్రఫలకంబు ప్రత్యక్షంబుగ నాయొద్ద నున్నది.”
అనుచు నాచిత్రరి తనచెలికత్తియకిట్టుత్తమవాక్యంబుల నాశ్చర్యజనకం బగుస్వప్నంబును వినిపించిన నదియు నాయమ చెప్పునదంతంబు సాంతంబుగ నాలకించి యాశ్చర్యముతో దల యూచి 'తరుణీ! నీ వపరిమితభాగ్యవంతురాలవు. మాజనని నీజన్మపూర్వంబున మేనకాత్మజ నారాధించి యామెను మెప్పించుటచే నామె నిన్ను బ్రసాదించెనఁట. నీ వనయం బామహాదేవి నారాధించుచుండుటంజేసి యామె నీయెడఁ గలకృపారసంబుచే చిత్రఫలకంబున నీ కనురూపుం డగుకన్యాకువన్నకాని నెన్నుగ లిఖియించి యుండు. నీ కీడు వచ్చువాఁడెవ్వఁడైన నెవ్వ రీలోకంబునఁ గానఁబడరు. ఇంక భూలోకంబున నీ కీడెవ్వరు? పోఁటి వేగ నైన నొర యసాధ్యంబగు నీపరిదేశంబున నిట్టివింత చిత్రఫలకం బుధ్భవించుట కష్టకారణంబు. ఏల యన, ఫలకంబున వ్రాయఁబడినవాఁడు [illegible]ధరవమాధవుండు. దానవులకు నాహ్లాదకరుఁడు శత్రుపక్షములోనివాఁ డగుటచేఁ

ఇయ్యది చిత్రవిశేషంబు గాక యిట్టినునుం డేలోకంబుననైన నుండెనేని యాతని జాయనుఁ గాను గాని నేఁ దచ్చరణంబులకడ దాస్యంబు సేయ నర్హురాలనే? ఏల యిట్టి 'యుడియూస' లని నిట్టూర్పు విడిచి యాతని వదనంబునఁ బ్రియోక్తి నిరూపించువాక్యం బులచేఁ దనమనోభావంబుఁ దేటపఱుచుమఁ దనబోటితోఁ దడవు సంభాషించుచుండు నతఁడ సమక్షంబున సంచరించుచున్నకలంబున నాన్యత్రాంతరంబు సాంతంబుగ నాలకించి వజ్ర నాభురాజ్యాంతఃపురసామీప్యంబు తథ్యం బని మదిం దలంచితి. ఏల యనిన,

ఆకాంతాలలామ ప్రద్యుమ్నునిజాయ యగునటులు వచియించిన కాత్యాయని వాక్యంబులకు బొంకు గలుగనేరదు. దైత్యాంతకనూజునకు నాదుష్టదానవుండు తనప్రతి కారత్వంబును దనంత నోసంగుట యసంభవంబు. ప్రద్యుమ్నుఁడా దానవుప్రతికి భర్త యయ్యెనేని వజ్రనాభుని కాతనితోడ యుద్ధంబు సిద్ధంబు. వజ్రపురిరాజ్యతంత్రంబులం బ్రభావతీపుత్రుండు నడపు నని నమ్మకముండుటచే దక్కనులయొక్కలంబు చెక్కుచెదరి దిక్కుసంబుగా నుండును. చిత్రఫలకంబు ప్రత్యక్షంబుగ నుండుటచే నధికవిశ్వాసాస్పదం బయినది ప్రాతఃకాలంబున నగుటచే సవిరభావియును నని పెద్దలు వక్కాణింపఁబడియున్న దాన. ఆయన్నులమిన్న నామధేయంబు ప్రభావతి యగుటయు నాజనరాలు వజ్ర నాభునిపుత్రిక యగుటయు విదియావృత్తాంతంబు సాంతంబు నొందినయనంతరం బామత్తకాశినులయుత్తరప్రత్యుత్తరంబుల నీయుత్తమకథనంబు వెలువడియె. ఇయ్యది భవదీయకార్యోపకారంబునకుఁ గారణం బైన తత్ప్రియావార్తను సానసమ్మానా బయ్యె. దేవకార్యనిర్వాహంబునకై ప్రద్యుమ్నసమాగంబు ముఖ్యం బగుటచే యత్నం బతిశయంబుగ జేయుట శ్రేయస్కరం బని తోఁచుచున్నది. స్త్రీచిత్తంబులు చంచలంబులు. ఎల్లవేళల నొక్కభావంబు నైకొనునవి కావు. త్వరితంబుగ నమహారకున్న విఫలంబై చెడు'' నని యాకాపంబిని నాసప్రనిగాపి దోలంగ సహజసారస్వవాణీరామణీయకంబుచేఁ గార్య కారణకామనీయకంబు నినుమడింపఁజేయ నత్రాయుండు తాను దలంచుకార్యానుకూలం బునకుం దె నాయంచసరివచనపచనావిశేషంబు చిత్తంబున కపరిమితానందం బొనగూర్ప నెమ్మిగ మెచ్చుకొనుచు తా నాపులుంగువాచావివేకంబు నీవిధంబుగ నుతియించె.

« సంస్కరింపఁబడినశబ్దజాలంబులమైత్రి యర్థసంపదలఁ బొదలఁ జేయ, ధ్వన యుక్తిపోషంబు పొందఁ బోక, యాకాంక్షాస్ఫూర్తితోఁ గథాకల్పనాచమత్కారము జూపుచు, పూర్వోత్తరవిరోధంబుగా రానీయక, స్వభావవర్ణనలతో నింపి, ప్రకృతార్థ భావంబు పాఠకులకు నలుపుచు, పదతిరగొలగ నీయక, మహావాక్యతాత్పర్యమునకు సరిపడం బలుక నేర్చుట బహుజన్మకృతసుకృతపరిపాకంబునం గాక యేల చేకుర నేర్చు? ఓనగలామణి! నీవాచామృతవిశేషంబు చూడ సామాన్యపురాయంచలచందంబు కాదు. భారతివో యామె దిద్దినకవివో యని యెన్నఁ దగి యున్నదానవు. లేకున్న నీచాతు ర్యంబు తిర్యక్సంతువులకు సహజంబుగా" యనుటయు నావిహంగము «పురందరా! రెండవ పక్షంబే నిజంబు. కమలాసనునితేజు గడపుపారంపరాహ్వయుం డనుమరాళవల్లభు పుత్రికను. భారతిచే బాల్యంబునుండియుఁ బెంపఁబడి తద్విద్యలశిక్షచే సకలవిద్యలం గ్రహించితి" నని తద్వృత్తాంత మంతయు వినిపించిన సువాసీరుండు «దానం జేసి కాదె నీ వింతసామర్థ్యంబున వెన్నెక్కి యున్నదానవు. అనంతరకార్యంబునకుఁ బోవఁ గావలె దీనత్వంబుచే క్షీరత్వంబును బాసి యున్నమాబోంట్ల నుద్ధరింప నెంచిన మాపాలిభా గ్యదేవత యనుగ్రహంబుచే నిన్ను నీరూపంబున నన్నింటికి నాధారంబుగ ననుగ్రహించి నట్లు పొడకట్టు చున్నది. ఈకార్యంబు నీవు తక్క యితరులు నిర్వహింప నేరరు. దానికై ని న్నింత ప్రార్థించు చుంటి. నామనవి నంగీకరించి దేవతాకార్యంబు నెరపి చిర కీర్తిం బొందుము. ఈకార్యంబు నెఱవేర్పఁ బరంగుపరివారంబుతోడం గూడి యథాప్ర కారంబున వజ్రపురంబునకుం జని యాంతఃప్రాకారోద్యానసరంబుల సంచరించుచు ప్రభావతి తోడిచెలిమి గలుగునట్లు నెఱింగి యాప్రద్యుమ్నునియం దనురాగ ముప్పతిల్ల నాతనిసౌందర్యగుణంబు లభివర్ణించి యాయిరువురకును శీఘ్రసమాగమం బగురీతి నెఱింగి యాయామకవ విధియుం దే ప్రేమ మనముందఁ జేసితి నేని నెవరిఁ బోయినసందేశనీలతిక పానంబులఁ బెనంగొనినచందంబున మనకార్యంబులెల్ల నెఱవేఱుటకు సందియంబు లేదు. ఎవ్వనంబున నెఱవేర్తువో యెఱుంగ రాదు. బహుజాగ్రత్త. ఈకథ సమస్తంబును జనార్దనున కెఱింగించి యాతనిచిత్తానుసారంబుగ మెలంగుట యుచితంబు. నీవు ద్వారకానగరంబునకుం జని దామోదరుని గాంచి యే నరిగితి నని తెలిపి యీ పూనిక సకలంబును నాతనికిఁ వివరింపుము. తక్కినహంసంబు లన్నియు ధనతోషింపంబునకై ప్రయాణం బని యెంచక కార్యనియోగంబున . కర్యము

కూలతం బ్రవర్తించి యీకార్యంబు కొనసాగింపవలయు" నని నుడివి యనుపుటయు, మరాళి యమరాళికార్యంబు నెఱవేర్పం బూని సురలచేఁ బొగడొందుచు నధికోత్సాహంబున హంసపిండుతో వెడలి చని చని రాజమందిరంబు బ్రవేశించి యుపవనంబునఁ దటాకప్రాంతకేళీగృహంబునఁ జందనచారుచర్చలచే నలంకరింపఁబడి తలిరులశయ్యపై నష్టమహిషీసమేతుం డై కృష్ణుండు వసియించి యున్నయవసరంబున తమ బలగంబుతో విలాసంబుగ నభంబు డిగ్గి యుపవనసరోలక్ష్మికిఁ దమశృంగారకాంతులఁ గానుక గా నొసంగుచు దవ్వుల నున్నకృష్ణు నవలోకించి యిదిరో యద నని హంసలసమూహంబుమభాపి తా నొక్కర్తుక, రుక్మిణియంకతలం బుపధానంబుగ నొనర్చి సత్యభామచేఁ బాదంబుల నొత్తించుకొనుచు భద్ర నురటియు మిత్రవింద పూనురటియు నిరుకెలంకుల నుండి వీవఁ, దములపుటాకుమడుపులను జాంబవతి యొసంగఁ, గాళంజిఁ దాల్చి కాళింది మేక్క నిలువ, లక్షణ జలకలశంబును పాదుకాభద్రిసమన్వితంబుగ నాగ్నజితియు సేవ లొనరించుచుండ విరాజిల్లుపుండరీకాక్షునియండ నిలువ, మరసదీపుండరీకంబు చందంబున నెలకొని ప్రకాశించుమానసౌకంబును గాంచి యామానవతులు ముక్కుమొగం బెఱుఁగనిశిశ్యస్త్రాకువు నదుకు బెదురు లేక యీవిధంబునఁ జెంతకు రాఁ గతం బే మని యద్భుతంబు నొందుచున్నతఱి నిజతనయుఁడు దమజానిపై కేగుట రుక్మిణి కసమ్మతం బై కార్యంబు చెడు నను శంకచే గృష్ణునిం గాంచి యావిహంగము 'మీతో నొక్కరహస్యంబు మనవి చేయుటకై సుత్రాముని చెంతనుండి దూతగ నేగుదెంచితి' నని నుడివినఁ, గమలనాభుం డాయుంచగరితసుముఖాదికప్రసంగకౌశలంబునకు మెచ్చుకొనుచు మందహాసంబుఁ జేసి సత్యారుక్మిణులయంకతలంబులనుండి చరణహస్తకంబుల నువ్వెత్తుగఁ దరల్చి లేచి జాంబవతిచెంత నున్నవాగవల్లీదళంబులకర్పూరంబు బాగాల నంది పుచ్చుకొనిన వతివ లంద ఱాసంకేతంబు నైతెంగి దూరంబుగఁ జన, హంసి కంసారిం గాంచి వ్యూను ఖామణాంబుల పద్రి లిలిపించు టాదిగా నచటి కతుపుట తుదిగాఁ దమకు జరిగినవచః ప్రసంగంబు నిరవశేషంబుగఁ జెప్పుటయు, నాతం డాకార్యనిర్వాహంబునకు వటుశిఖామణిపల్కుల్, లుపశృతిగ గ్రహించి నిశ్చితార్థం డగుచుఁ దమ కార్యానుసరణంబునకు వీడోద్భుతభాషితంబుచందంబున నాతనిం గడతేర్చుటకుఁ దగినసాధనంబుగ నీకేఁ డెగ్గడిరా కార్యసాఫల్యమునకు సంశయింపం బని లే దని సంతసం బంది తమకుంతంబున కేగిరి.

“అభినవబలదర్పపరాక్రమోపార్జితుం డగురుక్మిణీసుతుండు కామరూపు లగు దానవులకల్పితమాయావిలాసము నధిక్రమించుబుద్ధివిశేషంబు గలవాఁడు. ప్రభావతికి నిశ్చయంబుగఁ బతి కాఁ గలాఁడు. వజ్రనాభుం డీతనిచే నిస్సందేహంబుగఁ బరిమార్పం బడు. ఆతనినగరం బితరులు తదనుజ్ఞాసారంబునఁ గాని వేఱువిధంబునఁ జొర ననుపదు గదా! ఏవిధంబునఁ బ్రద్యుమ్నుం డాపురప్రవేశం బొనరించునో వివరించెద నాలకింపుము. మున్ను మజ్జనకాధ్వరసమయంబున భద్రుం డనునటప్రముఖుం డొక్కఁ డరుదెంచి మఖంబుఁ జూడ వచ్చినమునిప్రకరంబులఁ దననృత్యప్రభావంబుచే సంతోషాంతరంగులం జేసి వారలచే సప్తద్వీపగమనోపాయంబును, నాట్యంబుల నెవ్వరిరూపంబు దాల్ప వారియట్ల తనరునట్లును తా నితరులచేఁ బ్రతిహతుండు గా కుండునట్లును వరంబులఁ గొని యెల్లతావుల నర్తనప్రావీణ్యంబుఁ జూపుచు సంచరించు చున్నవాఁడు. దనుజాన కావార్తఁ దెలిపి కౌతూహలం బుప్పతిల్లఁ జేసి వానిప్రవేశంబున కియ్యకొనఁ జేసితి నేని మీనకేతనుం డావేషంబున రాఁ గలండు. అది మనకు పరమప్రయోజనంబు. దీని నాతనికడ నడపుమార్గంబును నందు వాటిల్లుప్రమాదంబులకుఁ దగినయుపాయంబులను నీవ యెఱుంగుదువు. సురకార్యంబు సమర్థింపు” మని యనుపుటయు, నాపులుగుపడంతి కులజాతులం గూడి యటనుండి కదలి గగనంబున నెగసి వజ్రపురగమనోన్ముఖంబై చనుచున్నయవసరంబున ద్వారకాపురబాహ్యప్రదేశంబున గందుకక్రీడాపరాయణుం డై యున్న ప్రద్యుమ్నుండు తనహృదయానుసారంబుగ హయంబునుఁ బో నిచ్చుచు వలయంబో పనుపడ నిల్పి ముందటికిఁ బఱపి కెలంకులకు దోలంగించుచు వెనుకకు తగ్గించుచు సమయానుకూలంబుగ మరల్చి వడివడి నడిపించుచు కందుకం బుద్దీనం బగురీతిఁ గొట్టుచు నితరులు తన్ననుసరింపకమున్న యాచెండును క్రిందఁ బడనీకుండ కోలచేఁ గొట్టుచుఁ జక్రగతిని హయంబు నవలించుచు దనచేతిరత్నమయదండముకాంతులు చూచువారికనుదమ్ముల మిఱుమిట్లుగొలుప చక్రాకారంబుగ తురగమును బరపుచు నాట లాడు చుండె. అత్తరి రాచూలి తురంగంబు వెన్నంటి తక్కినహయంబులు వ్యస్తంబు గాక చక్రాకారంబుగ బరిభ్రమించుతరి రథికులయాభరణములకాంతి కొఱవులు దిర్ప్రినచందంబునఁ గానుపించె. పంచమగతితో హయంబు లోరమోము: మొలగుమంచ వాగెల బిగియించు నిలచి వదనంబులఁ గలఖలీనములను ధ్వనింపఁ జేయుచు నురుగులను గ్రక్కుచున్నతరి నతఁడొన్న

నొక్కు సాహిణి నొక్కి పట్టె. దనసెయ్యంపుచెలిమికాడు హైదండ యొసఁగ ప్రద్యుమ్నుండు హయంబును డిగ్గె.

ఆయవసరంబున వియత్పథంబునఁ జనుచున్న శుచిముఖి యాతని విలోకించి నిశ్చయంబుగ వాఁడె యితండుగాఁ గన్పట్టుచున్నవాఁడు. ఈమోహనాకారునితోఁ బ్రసంగించి చనుట కార్యసాఫల్యంబున కుపాయం బని యారాచకోమరునికి వినుపించు రీతి నీడోద్భవంబులతోడ ముచ్చటించిన విని ప్రద్యుమ్నుం డచ్చెరువొందుచుండ నయ్యంచపిండు భూతలంబునకు డిగ్గుచు నేటవాలుగ పేరమువారి పక్షంబులు పార్శ్వంబులకు నిశ్చలంబుగఁ బరపి రతిపతియంతికంబున కెంతో వింతగఁ గొంతతడవు సంచరించి యంచితంబుగ మించి పారి కెంపుగ ముఖలి తెలిపి వారగ నొరగి మలపు దిరిగి రెయిరెక్కలు రెండు జక్కగ నెఱయఁ జాచి పుడమిపై గా లూని యొక్కొక్కర్తి మణిచి వలువంకలకుం బరికించి మొగముల నొయ్యారంబుగఁ ద్రిప్పుకొని ఛదనంబుల నిదిర్చికొనుచు సవరించి తమ చెలువగు విడంబింపఁ జేసె. అంతఁ బ్రద్యుమ్నుం డత్యంతకుతూహలంబున వానిని గాంచి "పక్షివరులార! మీలో మీరలు తొలుత నీతనితో సంభాషింపవలె నని నిశ్చయించికొంటిరి గాదె! ఇచ్చట నేవాక్యంబుల నెవ్వనితో ముచ్చటింప వలయునో యాతనిం బిలచి మాట్లాడుడు. ఎట్టికార్యంబునిమిత్త మెందులకుఁ బోవుచున్నవారో! మీర లవ్యాపదేశంబునఁ గార్యవిరోధంబు సైరించి యుండరు గదా యనుసంశయంబు చేత సంకోచంబు లేక మీకొరించి యీచందంబున పదియింపవలెఁ గాని భవదీయ సౌందర్య విలాసంబులకుం దనివి కాదు. మీయాకారగుణభావపాండిత్యములం దిలకింప దివ్యజాతి పక్షులచందంబునఁ గానుపించుచున్నారు కాని ప్రకృతివిహంగంబులు గావు. కారణంబు లేక యిట్లు రా"రనుటయును హంస శుచిముఖి మృదుమధురస్వరంబున జనానురంజితంబుగ ని ట్లనియె.

ఈప్రదేశంబున నే మిక్కిరు లెవ్వరితోడ మాటలాడ జనుదెంతుము? ప్రసహా తునియోగంబున బ్రహ్మపోత్రమునిపాలికిఁ జెంది యాతనిచే నీడ్వాలుపంబడి తదాజ్ఞానుసారంబున వాయువ్యప్రేయిష్టానుసారం బగుకార్యంబు నయంబున నెఱవేర్ప వేఱొక్క నొకటికి నేగుచొప్పది యయ్యెను నీవంటిగుణమణి నవలోకించి కొలు వింపక నేయక రొసఁగుట యుచితంబు గా దనియు సత్పురుషులసేవ శ్రేయస్కరంబున కాలవాల మనియు నీయనుగ్రహంబు కార్యసాఫల్యంబునకు మూలాధారం బనియు నెంచి యతిక్రమించి పోఁ జాలక నీసన్నిధానంబున కేతెంచితిమి.

నీవు వచియించినవిధంబున మేము త్రిపథగావిహారలాలసుల మగు టాయంచలము. యక్షిణీతనయా! ఏవిషయమునం దైనను నీమాపునకుఁ దప్పు గలుగునా? మేము కార్యపుల మగుటచే మమ్ము జిష్ణుండును మాజనకుం డగువిష్ణుండును మాయెడ వాత్సల్యము సంకోచము నందక యెట్టికార్యంబున కైనను నిట్టుల నియోగించి పంచి పనుపుకొనుచుందురు. నీ వనఁగ జనార్దనుం డనఁగ భేదము లేదు. కాన నేను బోయెడు కార్యంబును నీవంటియోగ్యునకు విన్నవించిన దోసంబు గా దని యాయేకాంతంబు విన్నవింప సాహసించితిని. మే మిచ్చటఁ బ్రసంగవశంబునఁ దడయుటకు వీలు కాదు. మేము పోయి వచ్చెద" మనిన బ్రద్యుమ్నుండు "మీ రరిగెడుకార్యం బేరికి నుడువ వర్ణ్యంబు గా కున్న బోనిందు. అతం డి యితం డనుకొంటిరి. పూర్వ మాప్రసంగం బెచ్చట నేకారణంబున రాఁ గారణంబు గలిగె. అది యైనను వచియింపఁ దగినదేని ప్రయాణంపుజాగు వికారంబు సూచ్చవింపఁ జేయ దేని వినువుకొనక సాయం దనుగ్రహించి నిమేషం బాగ వివరింపు" మనుడు సాయంచగరిత "రహస్యం బైనదియు వచియింపఁ గూడనిదియు నగు. భవదీయప్రశ్నంబున కనుగుణం బగుప్రత్యుత్తరం బొసంగ కుండుట మేలు గాదు. నీవు మాధవపుత్రుండ వగుటఁ జేసి నీ సందేహ నివృత్తికై మేము పోయెడుప్రయోజనంబును నీప్రసంగవిశేషసౌభాగ్యంబును వివరించెద నాలకింపు" మని వచియింప నుంకించి శంకించినలుసంకలకుందిలకించినదానినుంచ నగ్రహించి మానకేతనుండు తనపరివారసమూదయంబునకు సన్న సేయ దానివెంబడి పరిజనపరివాస కాదిబృందం బాముఖవికాసోచితంబుగ నడివడిఁ గడు నెడముగఁ గడువ, నంత రాయంచ గంతు సుపలక్షించి పంచదారను మించుతీయమంచిమాటలసంచు నంచితంబుగఁ గాంచి సంతసించుట నెఱింగి "కందర్పా! వజ్రనాభుం డనుదనుజాని వధియింప బహుదినంబుల నుండి యింద్రుఁడు నుపేంద్రుడుఁ బ్రయత్నించుచున్నవారు. తమకంటె ముందుగ వాఁ డేమి కీడు మూఁడఁ జేయ నున్నవాఁడో కడు వడి నెఱింగి వేగ నడప నన్ను నియమించుటచే నే నిప్పు డచ్చటి కరిఁగెద" నని వక్కాణింప విని యాసం "డావా! యీకార్యంబు దుర్ఘటం బైనదిగ నెంచి వారియుపుర భీతిల్లుచున్నచందంబు గానవించు చున్నది. మే మున్నసంగతి మఱచిరా లేక నిర్వహించుసమర్థత మాయెడ లే దని తలఁచిరా? ఏల వీరి కీవర్తి? ఇది యేపాటికార్యము? తమహితంబు తా రెఱుంగరు కాని యందులకు న న్నొక్కనిని నియమించినచో నిమేషంబునఁ దమనియోగంబుచే సాధింగు

రక్కసియు నెక్కుడఁగింప కుందువా?'' అని పొంకంబుగ బింకంబు వ్రాప, ప్రద్యుమ్ను నవలోకించి శుచిముఖి యంతరంగంబున నుప్పొంగుచు "ఇంద్రమాధవులచే ననయంబు బిట్టుగ గట్టిమోజనముఁ జేయఁబడుదానవుం డెట్టిబలాఢ్యుండో యనిశోచవాఁడు చందంబున డెందంబున మందంబు నొందక ధీరుండవై న న్నొక్కనిఁ బంపిన వాని నంతంబు నొందింతు నని పలికిన నీబంటుతనం బెంతయు వర్ణనీయంబు. రణశూరుండు తనతో నెనదియ్యక సమానంబుగ యుద్ధంబు చేయ సమర్థుం డగు పోటుబంటు జాణతనంబునకు కౌతుకంబుఁ జెంద కుండు నే? నీ వయ్యసురేంద్రితోడ సమరంబుఁ గావించుట యుచితంబె. యోగ్యు లయోగ్యం బగుకయ్యంబున కియ్యకొనరు గాని సాహసికంబుగ నుండ లేని తమంతఁ దామె యుద్ధంబునకు సిద్ధం బగుదురు. ఇదియె గదా పికికింత లేనిబిరుదుమగలలక్షణంబు. అది యటుండ, నీప్రసంగంబు మున్ను వచ్చిన తెఱంగు వివరించెద నాలకింపుము.

కొండొకకాలంబునుండి యనారతంబు వజ్రపురంబున కాపురంబున్నై యేమరుగుచుందుము. ఒక్కనాఁ డాపురీపరిపాలనాధ్యక్షుం డగు రాక్షసునిపుత్త్రిక యంతఃపురసామీప్యవిహారవనవృక్షచ్ఛాయల స్వేచ్ఛావిహారలాలస యై యొక్కలతాకుడుంగంబున వయస్యలతోడం గూడి బహువిధంబుల రసోదంచితసల్లాపంబు లాడుచున్న యవసరంబున, నాయున్నలమిన్నం గాంచి తీవ్రస్ఫూర్తి నయ్యె నమందానందకంపలిత హృదయారవింద నైతి. ఆవధూసౌందర్యసౌకుమార్యంబు లే మని వర్ణింతు? అవిశేషంబు వర్ణింప నావిద్యాచాతుర్యంబు చాలఁ బోదు కావున నైనను నా చేయఁ గొలఁది వర్ణింతు నాలకింపుము. ఆజవరాలి దేహకాంతి జాపువానవసించిని విరపించుచుండ మందస్మితేందువదనారవిందంబున కందం బగుచందంబున నాసాభరణంబున నెలకొని యున్న యాణిముత్యం బుత్తరోష్ఠంబుపై నటియింప, శిరోకారంబుల కిర వగుకర్ణంబుల నమర్చినరత్నభూషణంబులకాంతి చెక్కుటద్దంబులఁ బిక్కటిల్ల, నింద్రనీలంబుల నపహసించుముంగురులు లలాటపార్శ్వంబులఁ జిందులాడ, రక్తవస్త్రంబు కపోలంబులపైఁ జెంగలింపఁ, జందనాగరుచర్చలపరిమళంబుతోడం గూడి దేహసౌరభంబు వెలువడి పద్మినీజాతి నిరూపణంబు చేయుచుండె. ఆమోహనాంగిగాత్రమాధుర్యసుధారసధారల నెన్న వాగ్దేవతోపాసనాపుణ్యంబున నాకైపుణ్య మలవడినట్లు పొడకట్టు. నవలం దలంచిన మారుని బరాభవంబు సిద్ధించక మానదు. కరీరమ్మృదుత్వంబు శిరీషపుష్పంబుల

నిరసించు. శుకశారికావాదంబును విరాజకలుకులుగా, చిలుకంపుచెలువలం గేరునూగారును రమణీయవర్ణాంగంబును గలిగి మెఱయుచుఁ ద్రిలోకసంస్తవనీయం బగుచున్నది. ఈయంశం బెఱుంగక సరసాగ్రేసరు లగుకవికులశ్రేష్ఠు లొకవేళ శృంగారరసప్రధానం బగునటుల నెట్టివస్తువులతో నామెయంగంబులఁ బోల్చి వర్ణించినను హాస్యాస్పదంబుఁ బొసరించుట యగును గాని పొగడుట కాదు. ఒకవేళ నాకలోకవాస్తవ్యు రా లగురతిసతి యాకాంతాతిలకంబున కీడగు నని చెప్పినఁ జెప్ప నొప్పును గాని మానవలోకసంచార తిర్యగ్జంతుసమవయోవైభవ యనియుఁ, గూరవ్యాళసదృశరోమాళి యనియు వచింప, నీచోపమ యగుం గాని స్వభావోక్తి గాదు. ఆయమృతాంశుబింబా, ఆసొగసులదీవి నభివర్ణింప శేషుని కైన నలవి కాదు. అత్రిలోకసుందరియవయవంబుల నభివర్ణింప మానవులోపుదురా? అట్టియెడ నాకంటితిర్యగ్వనిత యీయంశంబు వర్ణింప బూనుట మిక్కుటం బగునాయాసంబునకే కారణం బైనను నానుపతిశృంగార వాటికలో నీకంటె మోహనాకారుం డీమంగాదుమంచఁ జూచువారలకు నుదమ్ముల కింతయు గొప్పిదంబుగ నుండు ననువమ్మికచే నాయసమానవిలాసంబు వేయివిధంబులఁ జెప్పఁ దెలివు వర్ధింపమిం జేసి స్థాలీపులాకన్యాయంబుగఁ జేటతెల్లంబుఁ గావించితి. అంతియె కాని వేఱు కాదు. అపూర్వశృంగారకళావిలాసంబుచే నొప్పుపరిపూర్ణావయవంబులఁ బ్రపంచానుభవపరిజ్ఞాతలు సహితము డోలాయమానమానసులు కాఁ గలరు కాని యాయవయవసౌకుమార్యసౌందర్యం బీవస్తుసముదాయమున కీడు వచ్చు నని నిశ్చయింప లేరగు. అపద్మగంధిని పద్మభవుండు నేరకేటిపసిండితాళగర్భంపు లగ్గును, వెన్నెలతేటనిగ్గును, యరవిందమృదుత్వంపుజగ్గును పొదివి యమృతంబు పదునిడి తనహస్తనైపుణీవిశేషంబు బయల్పడ నిర్మించెఁ గా కున్న నింత విడంబించునా? ఇట్టిరామణీయకం బెందును గాన రాదు. నాపరిజ్ఞానపరిభావంబున నావర్ణనీయవయవసౌకుమార్యంబు వర్ణింప లేకుంట సామర్థ్యంబు లేమిం జేసి కాదు. నన్ను భారతీమతల్లి వాఙ్మహిమంబునఁ దనయంతటిదాని నొసరింప నిచ్చ నొసమి హంసవంశావతంసుం డగు సారంగరుం డనునాజనకుని రావించి నన్ను దనయొద్ద నుంచున ట్లొడంబరచి ముద్దుగఁ బెనుపఁ బెఱుగుచు నాయమపరిసాదంబున సమస్తవిద్యలసారం బెఱింగి సమయానుకూలవచస్సందర్భంబున వదలుచుండు నాముఖ్య వాగ్వైఖరి శబ్దసౌష్ఠవపూరితం బని గ్రహించి నాకు శుచిముఖి యని నామం బిడిరి

అంతఁ గొండొకకాలంబున వాణీమహాదేవి రాణివాసనివాసిని యగునక్కలాజిరంబుతో వాగ్వాదంబునకై కవిత్వంబుఁ జెప్ప నియోగించిన నేనును నరదుల కియ్యకొని సరసవచోవిభవంబున నుపక్రమింపఁ దలపడి పాదించిన నాసామర్థ్యంబున కెంతయు వింత నొంది మంతనంబున సంతసం బంది నాదురక్కల నాయమ మృదుహస్తంబున నిమురుచు సాదరంబున నా కుపమాతిశయోక్తి కామధేనుబిరుదం బొసంగి యాభువనైకమాత తల్లిఖితనూపురంబు మదంఘ్రి నలంకరించె. చూడుము మిసిరియు నాబిరుదం" బని తనపాదాలంకృతనూపురంబున వర్ణనీయనికాయంబును ద్రిప్పి నారాయణనందనునకుం జూపి "యిట్టివావలుకులకు సహితము మాదనుజకన్యసౌందర్యంబు వర్ణింపఁ నసాధ్యం బయ్యె. ఆజగన్మోహనాంగియాకారంబు చిత్రపటంబున నైన లిఖియించి చూపుద మన్న నేయనయంబును భోసన చేయూద మన్నను నాయంగరామణీయకంబుచే మనం బానందంబునం జొప్పదొఁగి నయనంబులం దానందాశ్రులు గ్రమ్ముటచే బుద్ధి పరాయత్తంబుఁ జెందుతరి నాలనామణిరూపు రచియింప నెరితరంబు? ఆతరుణీమణిరూపురేఖలఁ జిత్రరువున వ్రాయనే శ్రీహరి కైన నలవడ నేని దక్షల్యానారీరత్నము నెందేని శతానందుండు సృజియింపక యుండునా? చతురాననుం డక్కన్యకాలలామంబు తనసృష్టియందలిది కాదనియు, కాత్యాయని యద్భుతమహిమంబుచే సృజియించె ననియు మున్ను ప్రసంగవశంబున వచియింప గనియున్నదాన. అపువ్వుఁబోడి పురాకృతపుణ్యఫలంబున విరాజిల్లు నెవమహాభోగికి భార్య యగునో, యామేటి చిరసౌఖ్యంబును బొంద గలఁ డని ముమ్మాటికి నొక్కి వక్కాణింపఁ గలను. నాపోటిపత్తులమాటలు నిశ్చయంబుగ నిక్షేపంబు లని తలంపుము. అపరాంగిసద్గుణప్రభావంబు వర్ణనాతీతం బగుటచే ప్రభావతి యనునర్థంబున కెంతయుఁ దగి యున్నది. ఓయదుకులకలశాబ్ధిపూర్ణనిశాకరా! యాదనుజేంద్రకన్య తనకల వంటిక పరిపూర్ణానుగ్రహంబున వ్రాసి యిచ్చె నని చిత్రఫలకాభిలిఖితం డగుపూరుషవరువిగ్రహంబు నమగ్రసౌభాగ్యకంబుగ వేచుచున్న తనచెలికత్తె యగుం జూచి కొంచి యొక్కగురుపీఠంబుఁ జేరి యాఫలకంబును విలోకించి సంతసించుచుండఁ గని విస్మయంబు గంటిమి. అదిప్రవర్తిమరమ్యాకృతిం దిలకించి యున్నతరిమింకేపి నిశ్చయంబుగ భవదాకృతి యాచిత్రరువున నమరించినచందంబున తెరంబును భేదంబు లేకుండుట విలోకించి యాకండె యితం డనుకొంటిమి. ఇంతియు గాని కేవలం దూ కాదు. మఱి యీప్రసంగవశంబున నవ్వేళ జాలకాలము నిలిచి యుండుట కార్యభంగంబు

నిచ్చ కుదిరినకతమ్మున నేమియుం దోచక నిత్యంబును మేలు గోరుమిత్రులప్రశ్నంబులకుఁ బ్రత్యుత్తరంబు లొసంగక యఖిలబాంధవనివహంబులఁ బలుకరింపక సేవ చేయుటకై చెంగటి కరుదెంచిన సేవకులసేవల కైకొనక భోజనంబునకు సయితము యుక్తకాలంబునం జనక యనయంబు పరాయత్తచిత్తంబున వర్తించుచు నంచగరితె మించ వచించినరూపవిశేషంబును మనంబునం దలంచుచు నుపమానరహిత యైనయాదానవరాజపుత్రికమనోహర తనూవిలాసభాసురంబు మఱపు రా కుండుటం జేసి మనంబు మరలింప నేరక పక్షివచనంబులు లక్షణలక్షితంబులుగ నెంచి యంగలక్ష్మలక్షణంబుల కానందించుచు నాశృంగారవతిసౌందర్యంబు హంసాంగన నుడివినదానికన్న వేయిరెట్లెక్కుడుగ నెంచి యారూపంబును బదెంబది స్మరించుచు నాయనయుపస్థితి కచ్చెరు వందుచు నిశ్చయంబుగ నాతామరసాక్షిరూపం బెయ్యదియో యయ్యదియె మనంబునం దోచిన నబ్బి తబ్బిబ్బై సుఖమబ్బుఁ గదా యని యెంచి యంతమే లెటు ల[illegible] నని వితర్కించి నిట్టూర్పు విడిచి యాలేమను జూడనిజాణజన్మంబు నిరర్థకం బని తలంచు. తలంచి యుపాయాన్వేషణంబు గావించి కుందు. కుంది ఫలసిద్ధించిన నేమికార్యం బని వెతలం బడు. వెతలంబడుచుండు నవసరంబునం బలుకరించినవారిపై నలుగుచు నెవ్వగలం దగిలియుండు.

ఇట్లు విరహావేదనాదోదూయమానుం డగుచు జనార్దనతనూజుం డొక్కనాఁ డుపవనంబునఁ జంద్రకాంతశిలావేదికపై నాసీనుం డై హస్తన్యస్తకపోలుం డగుచు నేకాంతంబున ని ట్లని వితర్కింపఁ దొడంగె. “కనులం దిలకింప కున్నను గుణరూపంబులవర్ణన నాకర్ణించినవెనుక నాకాంతాలలామంబును గోరి చింతింపక మనం బె ట్లూర కుండఁ గలదు? మనమున కగోచరంబు నసాధ్యంబు నగుకార్యం బైనను వర్ణనాకర్ణనంబునంజేసి మదియనూనసము న్విళ్ళూరఁ జేయుచున్నది గదా! ఆహా! ముక్కు మొగం బెఱుఁగని యాతరుణిరూపంబును నాయెదుట వర్ణించినంతనె మనంబున కింత యాతురత వొడమెను? పొడవినవోఁ జేకూరునా? చేకూరినను జేకూర కున్న నిది న్యాయమా? అనుంవరాంగి సుందరవదనారవిందం ను నయనారవిందంబులోఁ జూచుభాగ్య మేనాఁటి కైన నాకుఁ జేకూరునా? అది దుర్లభంబు. ఏల యనఁ దత్పురం బాయసురునియనుజ్ఞ లేనిదె చొర నసాధ్యం బఁట. అట్లు పోఁ గలిగిన నావిలాసవతిం దిలకింతు నెట్లు? చూచెద నను కొందము. కనుపించినవెనుక సంభాషింపక తాళఁ గలనా? తాళలే కున్న మోసం బగును గదా! అమానవతి నన్నుం దిలకించి నా కనుగుణ్య యగునా? కా కున్న బ్రతుకు టెట్లు”

అని యనేకవిధంబులం దలపోతలకుం జొచ్చి "అంచగరిత వచియించుతరి పాపంపులజ్జ పైకొనం గోరిక మాటుపరచి నేను వట్టిచోరతనంపునీటుం బ్రకటించితి. అంతియే కాని యాక్షేమసమాచారము సావధానంబుగ నడిగి తెలిసికొన నైతిని. దానం జేసి యనాదరంబుం జూపితి నని తలంచి యారాయంచ వేగంబ యిటనుండి కదలినట్లు తోచెడిని. సరసులు రుచియింపనిప్రసంగముల నుడువం బోరు గదా? హంసి నాయెదుట నాముద్దియను వర్ణింపిననాటనుండియు నామనం బాసుందరియందుం దగులుకొని మరలింప సాధ్యము గా కున్నయది. అదియునుం గాక నారూపంబున కనురూపపుపురుషరూపం బాజవరాలిహస్తంబునం గలచిత్రరువునందు లిఖియింపంబడి యుండినట్లు చెప్ప విని యుంటిని కాని సమానాకారంబు గలవా రందఱుం గానంబడుటచే నావచనంబు విశ్వసింప వీలు లేదు. నే నాప్రసంగంబున నింతక చన వొసంగిన మరాళి యాదనుజేంద్రకన్య నన్ను వరించునట్లు చేయు ననుట కేమియు సందియంబు లేదు. లే కున్నం బ్రసంగవశంబున నాచెలికానిరూపంబుల నాసన్నిధానంబున నేల ప్రస్తావించును? అద్భుతరమణీయరూపయౌవ్వనాదుల రసికాగ్రగణ్యులు ప్రసంగవశంబున రసోదంచితంబుగ వాగ్ధారాప్రభావంబున వర్ణింపక మానం జాల రని భావించిన నకారణంబుగ వనితావర్ణనంబుం జేయుటచే నేదియో కొంత వింత సుస్తం బై యుండియుండు. అటు గాకుండినం గోరవము వినూపసులకు మాత్యంబు నెరపుచు వారియనుమతంబునం గార్యాంతర్వర్తి నై యున్నమరాళి తనంతటం దాను జనుదెంచి పోయెదుకార్యంబు తెరంగుం జెప్పుచు నం దొక్కక్షేమను వచోవిభవంబునం బొగడుట మదీయమనోభీష్టంబు నెఱుంగుటకుం గాని వేఱొకకారణ ముండును? దానివలనం బ్రయోజనంబు జరుగుచున్నట్లు పొడకట్టుచున్నది. హంస ముద్దారాక్షసపరితాపంబుం జెప్పునప్పుడు నే నాడినవీరాలాపంబులకు మెచ్చి దామోదరునకు దక్షిణభుజం బనం దగినవీ వాతని సంహరింతు వని పలుకుట సహజంబె యని నమ్మం గొనియాడె. ఇవి యన్నియు నైకకంఠ్యముగ నున్నకారణంబున నా కాలేమయం దాశ జనించుచున్నది. నారూపం బాపారసాక్షిహస్తగతం బగుచిత్రఫలకంబునం దుండుటం దిలకించితి నని హంసపాతంసంబు నుడువుట వింటి. నారూపంబు నెవ్వరో నిర్దిష్టంబుగ నెఱింగి వ్రాసియుండు రని యూహ చేసి యున్న భవానిచే వ్రాయంబడె నని వచియింపంబడియె.

ఎక్కారణంబున నాయమ మదీయరూపంబును రచించి యామె కొసంగి యుండునో? లేక యితరులచే వ్రాయఁబడి పైవ్యాజంబున నొసంగఁబడి యుండునా? ఈకార్యంబున కం దెవ్వరు సాహసింతురు? అంతఃపురకాంతల కిట్టిది భ్రమూలంబునం దక్క వే ఱెట్లు చేకురు? ఆపలకంబు విలాసార్థం బగునాటకవస్తువుగఁ బరిగణింపఁబడునా? ప్రేమాతి రేకంబున పార్వతిచే నియ్యఁబడె నని పరమామోదంబుచే నాసుందరి చూచుచుండె నని వింటి. అది యెట్లుపేక్షణీయం బగు! ఉమ తనచే సృష్టింపఁబడినదిష్టయభిప్రాయంబున కడ్డంబుఁ దలపెట్టునా? ఇది యంతయు నిక్కువంబా? నిక్కువంబు కాకున్న విరించి యామె తనసృష్టియందలిది కాక యుమచే సృష్టింపఁ జేయఁబడె నని ప్రసంగవశంబున వచియింప వినియున్నదాన నని కాదంబకాంత పలుక, మాటాటంబున నాసుందరి యేసుందరాంగునకై యామెచే సృజియింపఁబడెనో తెలిసికొనక మందబుద్ధి నైతి నని నన్నిప్పుడు దూఱుకొన్నఁ బ్రయోజనం బేమి? వరటాలలామం బావిలాసవతి ప్రస్నా విశేషంబు నుగ్గడింపఁబట్టిన వేళఁ గొలఁది ప్రశ్నావసరంబు లుండిన నొక్కదానిఁగూర్చి యైనను నే వదుగ కుండుటను గ్రహించి యిచ్చావిహారిహితుండె నని యోచించుచుఁ జెంగట నీప్రసంగంబు రా నెఱుంగనిచందంబున నుండునే కాని యేమి వచియింపఁ గల్గునా? తా నీయంశంబు ప్రశంసింపు నవసరంబున నే నొక్కయిష్టవచనంబును బలుకక మిన్నకున్న చెన్నుగాంచి తా నచ్చటి కేగుట నిష్ఫలం బని చన మానునో, లేక పోవునో, ఎవ్వ రెఱుంగుదురు? దైవకృతంబుఁ దప్పింప నెవ్వరితరంబు? ఎట్లు జరుగ నున్నది యట్లె జరుగును గాని విచారించిన ఫలం బేమి? ఒకవేళ జను నమకొన్నను నాయభిప్రాయంబు విని కని యెఱుంగనిమహాత్ముని యెఱుంగనివిషయంబును గూర్చి యాచేడియ కడ నేమి వచియింప నేర్తు? "అప్రతిషిద్ధ మనుమతం భవతి" యనులోకోక్తి యెఱుంగ కుందునా? అటు పోవఁ గార్యంబు లేక యుండినను బహువిధస్వనాదుస్వాద్య యగు నాపడఁగుక జాడఁ జూడక తాళఁ గలనా? కన్నకాకన్నంబునని యామొద్దియుఁ జూడఁ గుతూహలము పొడముచున్న దని మునిశ్రేష్ఠ సకరిఁ జూచియున్న జాలపాద మాలేమను పరిగి చూచుకుంత సహింపఁ గలనా?"

అని యనేకప్రకారంబులఁ బ్రద్యుమ్నుండు మనస్సంకల్పసామర్థ్యంబున నామాని నీమణిమధురాకారంబు మఱపు రాక వేదించుచుండుటం జేసి మనశ్శాంతికై వనవిహారంబు నకుం జనఁ దనవాంఛకు నన మంతయుఁ బ్రభావతీయాకారంబుగఁ గానుపింప మనో వికారవిభ్రమముచే భ్రాంతుం డై "హంసి నిర్హేతుకకృపారసంబునఁ దనకుఁ దా నరు దెంచి హితవాక్యములు వచియింప గంభీరంబున నంతరంగం బెఱుంగఁబడ నీయక మాటు పరచిననిర్దాక్షిణ్యున కట్టిమందరాంగిపొం దన్నటి కైన లభించునా?" యని తన్నుఁ దానె దూరుకొనుచు "నాలేమ నాకు సంప్రాప్తం బౌసమాచారము నటుండ నిచ్చి హంసిని జూడఁ గలభాగ్యంబు గలుగునేని నాయదృష్టం బింతంత యని వర్ణింపఁ జాల. ఏవిధం బున నాజాలపాదంబును జూడఁ గలుగుదు? సునాసీరుసమాచారంబు గోవిందున కెఱిగించు నెపంబున నేతెంచి ప్రభావతీక్షేమసమాచారం బించుక యెఱింగించి యాహంసి నాకు శ్రవణానందము కావింప కుండునా? ఆక్షణంబున నె నామనంబు మితిమీరినవిరహంబుచేఁ గరంబు కుందుచున్నదియో ప్రత్యక్షం బగుచిత్రఫలకంబు నపేక్షాపూర్వకంబుగ నుప లక్షించు నాజవరాలిమనం బెంత వేదనాభరంబున వెతలం బొందుచున్నదియో యెఱుంగఁ జాల. ఆమెయుం గుబోడిక దనకు మరాళం బరిగి తాను నాతోడ మాటలాడుటయు నే నభావంబుఁ జూపుటయుఁ దెలుప నాలేమ యాస లేమిం జేసి గాసి నొందె నెట్టికార్యంబు నకు సాహసించునో కదా! ఏమి చేయుదు? విహంగము దివస్పతిపంపున మరల నిచ్చటి కరుదెంచు టెన్నఁడు? దానిచే నాయభిప్రాయం బాకలికంటికి వాక్రువ్వఁ బంపు టెన్నఁడు? అంతవఱకు నాప్రాణంబులు నిలుచుట దుస్తరంబు కాన నాసమాచారంబు తక్షణంబ యాచంచరీకకుఁ బత్రిక రచియించి యాహరిణాక్షికడ విడిపింపఁ బంపుదుఁ గాక" యని నిశ్చయించి యంతనంతనే కపటివని శుచిముఖి పేర నొక్కపత్రిక లిఖియించి యెవనిచేఁ బంపుటకును దోచక డోలాయమానమానసుం డై యుద్యానంబునఁ దనలోఁ దాను వితి ర్కింపఁ దొడంగె.

"ఈలేఖ నచటి కేరీతిన నంపఁగలను? ఎవ్వానిని బ్రార్థింతును? అచటికి బోఁగలవా రెవ్వరు? ఆపురం బీహంసిచేఁ జెప్పఁబడుట తప్ప నెప్పుడు నెవ్వనిచే నుచ్చరింపఁబడక పోవు టచే నాపురం బెవ్వ రెఱుంగుదు రని నిశ్చయింపఁ గలను? నాప్రయాసం బంతయు నిష్ఫలంబె. ఐనను బ్రయత్నించి చూచెదఁ గాక" యని యుపవనంబున కరిగి విరహానల తప్తమానసుం డై యుక్తాయుక్తవివేచనం బడుగంటుటం జేసి చేలనై యాపురం బా

గౌరవింపదగినదై కొంతతడ వనేకభావంబు లా పటంబునఁ జూచిచూచి సంతోషాంబుధి నోలలాడి మనంబునకుఁ దృప్తి లేకుండుటచేఁ బలుమాఱుఁ జూచి మురియుచుఁ గనుఁగవ నరమోడ్చి సాక్కి "యిట్టిసుందరాకారుం డెం దైన నుండెనేని యాతండు నన్ను జేకొన నిచ్చకొనిన నే నెంతయు ధన్యురాల నగుటకు సందియంబు లేదు. ఇట్టిసుందరుని వరునిగఁ బడసి సుఖియించు నాతీరత్నంబు జన్మము జన్మంబు కాని యితరులజన్మ మొకజన్మమా? అది తటస్థింపదేని నాజన్మ మేల కాల్పనా! అతం డేకపత్నీవ్రతుం డై వివాహితుం డైనయెడ నాగతి చితియో కూపమో విషమో త్రాడో నిశ్చయింపఁజాల. నిజంబు తెలియుదనుక నేమి నిశ్చయించుటకును వీలు లేదు. దైవము శరణ్యం బగుఁ గాక! దాక్షాయణి యట్టివాఁ డైన నేల వ్రాసి నీప్రియుఁ డగు నని చూపు? ఇది యంతయుఁ జిత్రంబుగఁ గానుపించు చున్నది. ఇంతకు నావాంఛాఫల మేతీరున నున్నదో తెలియఁజాల." అని నిట్టూర్పు విడచి మనోవేదనపా లగుచుఁ దన చెలితోడ నీవిధంబున వచియింప నుపక్రమించెను. "చెలీ! భవానికి నేను సపర్యలు సలుపునవసరంబున నెట్టిదోషంబు జేసితినో దానికై యామె నాకీ మనోవేదన గలిగింప నోపు. లోకంబున నిట్టివిలాసవంతుండు గలఁ డని ఫలకంబున రచియించి మోసగించి నన్నలమటపాలు చేయుట కరుణాంతరంగిణి యగుశంకరురాణికి విహితం బె?" యని వచించుసమయంబున నాపలుకుల నాలించుచుఁ బ్రాంతంబునను విహరించు చున్నశశిముఖి యాకాంతాతిలకంబులోఁ జెలిమికలిమి యలరఁ జేసికొనుట కిదియె యద నని మనంబున నూహించి యుపాయాన్వేషణంబు గావించుచు నాలేమయెదుట మందగమనంబున నేగునటుల నభినయించుచు ప్రభావతిహస్తగతం బగుచిత్తరువు నిలకించుచు నాయాశ్చర్యంబు గొలుపునడకలతోఁ గొంత నుండి ముందునకుం జనుచు నోరగ మోర వంచి చూపును పలకముపైఁ బరపుచు సంచరించుచుండ నాయంచగరితం గాంచి ప్రభావతి తన ప్రాణసఖి కిట్లనియె. "హంసగమనం బెఱుంగనియాపురుషుం దా నే మెఱుఁగుదు నని యీపలకంబుపై దృష్టి నిగుడించుచున్నదో?" యని వచియింప, నావేడుకకు నాపలుకు విహంగి మృదుమధురవాక్యంబుల నిట్లనియె. "ఓ యవంతీ! మాబోటితిర్యగ్జంతువుల కేమియు దెలియనిమాట సత్యంబె యైన నీహస్తంబున నెలకొనినచిత్తరువును నత్యాశ్చర్యంబునఁ జూచుటకు కొండొకకారణంబు గలదు వినుము. మున్నొక్కప్రదేశంబున నొక్కపురుషాకారంబును గనుఁగొని యుంటచే నిశ్చయంబుగ నాపురుషునియాకారం బిందు రచియింపఁబడినదియు లేక తత్సమానరూపము గలవేఱొక్కమానవునియాకారం బిందు లిఖి

యింపఁబడినవిరో యని నావీక్షణంబును దానిపైఁ బఱపఁ గారణంబు గలిగె" ననిన నాలించి సంతోషాద్భుతసందేహంబులు మనంబున మల్లడిఁ గొన, బ్రభావతి పులుఁగు నుపలక్షించి "యేమేమి!! మఱియొక్కసారి వచియింపుము. ఆమహానుభావునియాకారంబునకును బటంబునం గనఁబడుచున్నరూపంబునకును నేమేని భేదంబు గలదో లేదో చెంత కరుదెంచి పరికింపుము. సరసవాక్యసందర్భసామర్థ్యంబు గలిగిననీవు మహానుభావురాలవని నామనంబునఁ బొడగట్టుచున్నది. అట్టినీవు మామనంబులఁ గని పెట్టఁజాల కుందువా? హంసీ! చెంత కరుదేర భయం బేల" యనిన నాపులుంగు పువ్వుబోడిని విలోకించి "యేను మీవంటివారి చెంగట కరుదెంచుటకు భీతిల్లుదానఁ గాను. మీచే నాకు భయంబును లేదు. కాని యిరువురుచెలికత్తియలు మంతనంబున నేకాంతం బాడుకొనుప్రదేశంబునకుఁ బిలువకుండ వచ్చుటకు నే నంత వెఱ్ఱిదాననుగా" ననిన ప్రభావతి నివ్వెఱ గంది తానును రాగవల్లరియును మొగమొగంబులు చూచికొని నగుచు నవ్వాక్యంబులు వీనులకు విం దొనర్ప యమందానందంబును డెందంబునఁ జిందులు ద్రొక్కుచు సుందరంబుగఁ గానుపించుటచే సంభవించినయాశ్చర్యంబున మున్నై యాయంచజయానవాక్యామలాపంబునం గలమిక్కుటం బగుబుద్ధులు మూర్ఛ లోనఁగూర్చుచుండ, రాగవల్లరి "యీవిశేషం బశేషం బేశ్శృంగారవతులయందును విని కని యెఱుంగము. భూమణం బైనదీని భాషణంబు లెంత గంభీరంబులో విలోకించితే" యంచు ప్రభావతితోఁ బలుకుచు నాయంచపై మించినదయ నించి కాంచి "యోపులుఁగులపొలంతీ! నీపలుకులు నిశ్చయంబుగ మెచ్చఁ దగియున్నవి. మక్కువచే మిక్కిలి యక్కఱపడి చక్కఁగ వేడకున్న ముద్దియలిద్దఱు ముచ్చటించుకోటునకుఁ బిలివి తేటలు గలబోటు లేటికి బోయెదరు? ఇవి యట్లు కాదు. మే మిరువురము మొకసంశయంబు దీర్చుకొనుటకై ని న్నింతగఁ బ్రార్థించుచున్నవారము. నీ వింతకు మున్ను విలోకించితి వన్నచెలువునియొప్పును యీచిత్తరువున వ్రాయఁబడినచొప్పును నొక్కటి యగునో కాదో యిచ్చెంత కరుదెంచి విలోకించి నిశ్చయించి చెప్పుము. ఇప్పు డిప్పుడుము నేను నిట్టిసుందరుండు కలఁడు లే చెనువివాహంబునఁ బన్నిదంబు పన్నియున్నవార మటుగాన, నాయంచ యిట్లనియె.

“బందియంబున కైన నేమి? మఱి యేయితరకార్యంబున కైన నేమి? దానిం దెలిసికొనుట నా కావశ్యకంబు గాదు. మీకు నానలనఁ గావలసినకార్యము విచారించి వినరించెద” నని పలికిన, శుచిముఖివాక్యంబున కాపడంతులు దీనిభావం బెంతగూఢం బై యెంతసారం బరుగుచున్నది యని తలంచుచుండ, నాహంసి కొంతచేరువకుం జని విమర్శనపూర్వకంబుగ నాయాకారంబును బరికించి చూచి ‘యీ నిది యాతనిరూపంబె; యిందణుమాత్రంబును సందియంబు లే’ దనుటయు, రాగవల్లరి పరమామోదంబున నాయండజయానయుండకుం జని మెండగుగౌరవంబు నిండారఁ దనరెండుహస్తంబులం జాఁచి దానిరెండుపక్షంబులపై నిడి యెత్తి కడుఁగడిం జని ప్రభావతిదండ నిడి యల్లనల్లనఁ దనకొనగోళ్ళ నాతనూరుహంబుల సవరించుచు నంచ నుద్దేశించి “యోపుణ్యవతీ! కరుణాయత్తచిత్తంబున మామూర్తినంతయుం గాంచి మమ్ము రక్షింప నేతెంచినభాగ్యదేవతవు గాని యంచవు గావు. మదీయవాదమును నేఁడు గెలిపించితివి. ఈమానినీమణి యిట్టిమనోహరాంగుఁ డేజగంబున నుండియుండెఁ జని నాతో గట్టిగ వాదించుచున్నయది” యనిన విని ప్రభావతి నిజవయస్యం జూచి “రాగవల్లరీ! నీ వేల వేగిరించెదు? ఔ నని నంతమాత్రంబుననె యీప్సితార్థసిద్ధి యగునె? తాను దిలకించినపురుషునిలక్షణంబు లే మైన నీచిత్రమూర్తియందుఁ గానిపించుచున్న వేమొ యడుగు” మనిన హంసి చిత్తరువును నిరూపించి ప్రభావతి నుద్దేశించి “యిం కేమి కావలయు? అల్లదిగో! రతికంకణాంకముద్రిలు మెడయందు గనిపించుచున్నవి. సకలావయవపరిపూర్ణశృంగారవేషంబున రంగారు మంగళవిగ్రహునియాకారంబు నెవ్వరో చక్కఁగ నెఱింగి వ్రాసిరి. ఈలక్షణయుక్తుండగుపురుషునినామజాత్యాదు లత్యంతప్రసిద్ధంబు లగుటచే లోకంబున నెఱుంగనివారుండరు. రాణివాసపుకలుగంటు లగుటం జేసి మీ రెఱుంగ రేమొ యని యెఱింగించెద నంటినేని లోకంబున నెవ్వ రెంత మనసిచ్చి మాటలాడెదరో వారితో నంతమాత్రమే చనవిచ్చి మాటలాడవలయు నే కాని యధికప్రసంగమునకుం జనుట యుక్తంబుగాదు. మీగెలుపోటములు తేటఁబడుటకు నేఁ జెప్పినదియె చాలు. ఇతరాంశంబులం దలపెట్టుటవలన కాలయాపనంబు తక్కఁ బ్రయోజనంబు లేదు. నీపేరు ప్రభావతియు నీచెలినామంబు రాగవల్లరి యనియును దెలిసికొంటి. ఈమోమోటంబును మఱువకుఁడు. పోయి వత్తు” నని నింగి కెగయఁ జూచిన, దానవపుత్త్రి తనకరాంబురుహంబున శకుంతంబును గదిసిపట్టి పాణిపుటం బెట్టి వివిధప్రకారంబుల ప్రియానులాపంబులచే ననునయించుచు

"ఓ కాదంబకాంతా! నీరూపలావణ్యాదులయింపును, నీగమననైపుణ్యంపుసొంపును, వచో, విశేషవైభవంబుపెంపును, దిలకించిననాటఁగోలె నీచెలిమికై నామనం బువ్విళ్ళూరుచున్న యది. నీనేర్పరితనంబు గొంత యెఱింగినయనంతరంబు నిన్ను జాగవిడుచుటకు మనంబు గొల్పకయున్నది. పేరునకు రాగవల్లరి చెలికత్తియ కాని నీవు నాబహిఃప్రాణంబ వని నిశ్చయంబుగ వక్కాణింపఁగలను. వినయపూర్వకవచనంబులచేఁ గరంబుఁ బ్రార్థించు నావిన్నపంబున కియ్యకొని నన్ను ధన్యురాలినిగఁ జేయు నాచెలిమి కొడఁబడవలయు" నని వేవిధంబులఁ గోరుచుండ, నాదనుజకన్యాలలామంబును గాంచి హంసి "నీ వేకారణంబుచే నాసఖ్యంబును గోరుచుంటివో, యాకార్యరహస్యంబునకు విఘాతంబు గలిగిన యెడ నాచెలిమి దుస్సహం బగు. దానిచే నిప్పటిమీమంతనంపుంబనిరక్షణకై నన్ను వీడ్కొలుపుట యుచితంబు గావున పోయి వచ్చెద ననుజ్ఞ ని" య్యనుటయు, రాగవల్లరి విని "యోహంసలతల్లీ! పోయెదఁ బోయెద నందు మామనంబుల నేల కలంచెదవు? మారహస్యకార్యరక్షణంబునకు నీయునికి విరోధించునది కాక నిర్వాహమూలమై సకల సుఖంబులఁ జేకూర్చు ననుటకు సందియంబు లేదు. తన్నిమిత్తంబుగ నీస్నేహంబు గావలయు నని నిన్నింతగఁ గోరుచున్నవారము. కాని నీయాకారరామణీయంబునకుఁ దవిలి కాదు. నీసరసవచనంపుసొంపు దిలకింప నారహస్యంబు నీకు వినిపించుట యుక్తంబె యైనను శుద్ధాంతకాంతారవాసదోషంబునం జేసియు ముగ్ధనాయికల మగుటంజేసియు మేమయి యామాట మాటుపెట్టక త్వరితంబుగ వెలిపుచ్చనేర కున్నవారము. మనసిచ్చి ప్రార్థించినం గాని యేకార్యంబునకును నీవు పూనుకొన వని యున్నయందు వచియించితివి. మే మాకార్యంబును మఱుంగుపెట్టి భాషించుట నీకడ భేదం బోకొట్టుట గాని వేఱు కాదు. వాక్యచతురత్వంబున నిన్నోడించుట మాశయంబు గాదు. నీవు చూచితి వన్నట్టి శుభాంగుఁ డీసుందరాంగియాసల కాస్పద మైనవాఁడు. అతని నామజాత్యాదుల విచారించి సంతోషపఱుపుము. ఆసమాచారంబు విచారింప జాగొనరించెదేని నీకమనీయగాత్రి మనంబున కాయాసంబు గలుగఁ జేయుటయు గాని వేఱు గాదు. కరుణించి శీఘ్రంబ యాయుదంతంబు నెఱింగించి రక్షింపుము. అనంతరంబు మావృత్తాంత మామూలాగ్రముగ నీకు విన్నవించెద" మని యాతురంబుగఁ బలికిన, శుచిముఖి తదవక్రోశం బాలించి "సఖీయులారా! మీ రంతఃపురవాసు లగుటచే మాయామర్మలతెఱంగు తేటతెల్లంబుగఁ దెలియఁజేయక గూఢంబుగ దాఁచి యర్థాంతరంబుగఁ బ్రసంగించుచు నిషిద్ధ మనకుంబచే

నేమి చెప్పిన నేమి మోసము వచ్చునో యనుసంశయంబున నూరకుంటిని. మీగుట్టు మీరు బైటఁబెట్టుటచే నిఁక నాపురుషరత్నముసమాచారంబుఁ జెప్పెద నాలకింపుడు.

కలదు గదా ధరారమణి కలంకారం బై సకలజనసంస్తవనీయం బైనభరతఖండంబునందు సకలవిధభాగ్యంబులకు స్థానం బై యొప్పుచుండు ద్వారక యనుపట్టణంబు. దానిసౌందర్యసౌభాగ్యంబును నే నెఱింగినంత నెఱింగించెద నన్న, మీరు కథావిలంబనంబునకు సహింపఁజాలరు గాన దాని నటుండ నిం" డని పలికిన, హంసి కామద్రియాలు «నీ వెఱుంగని దే మున్నది? మేము వేఱుగ వచియింప నేల?" యని నవ్వుకొనిన, మరాళంబును నవ్వి «మందయానలారా! ఆపురీవరంబున యదుకులాంబోధియందు దీనరక్షణపరాయణుం డగు కేశవుండు మానవావతారంబును దాల్చి కృష్ణనామంబున విరాజిల్లుచున్నవాఁడు. ఆతండు తనభార్యలతోడం గూడి సకలవిధసుఖంబుల ననుభవించుచుండు. అందు లావణ్యరాశి యగురుక్మిణి యనుకాంతకు కుమారుండై జనించి ప్రద్యుమ్ననామంబున నొకసుందరుండు దినదినజనితయౌవనంబుచేఁ గరంబు ప్రకాశించుచుండు. ఇందు వ్రాయఁబడినది యాతనిదివ్యరూపంబు. ఆతనిగుణగణంబులు గణనాతీతంబులు. శౌర్యగాంభీర్యకారుణ్యంబులు వర్ణనాతీతంబులు. సౌందర్యసుకుమారంబులు శిరీషపుష్పకోమలంబులు. ఎం తని వర్ణింతు? ఏయేపట్ల నెంతెంత యుచితంబో యంతయంతయుం గలిగి విలసిల్లు" నని వచియింప, నారాక్షసకన్యారత్నము సంతోషాయత్తంబున పరవశత్వంబు నొంది వికసితవదనారవిందముతోఁ గులుకుచుండం గాంచి రాగవల్లరి ప్రమదంబు నొందుచు «చెలీ! నీకు వరం బొసంగినయార్యామహాదేవివాక్యంబునకుఁ దార్కాణంబుగ నీవలపుకానినామజన్మములును నివాసంబును దెల్పి మరాళి నీసంశయనివారణం బొనరించినది. ఈకాదంబకాంతవచనసమర్గలాలిత్యంబు విలోకింప మీఁదికార్యంబును నిర్వహింపనట్టిగట్టిదనం బీమెకడఁ గన్పట్టుచున్నది. మొదటినుండియు విద్యావిశారదయై సకలవిద్యలం గ్రహించి సరసప్రసంగసంపదచే నలరుచుంటచే నేమొ కాలియందు పెండెరంబు నొక్కదానిని ధరియించియున్నది" యని దానిపైఁ గల వర్ణంబుల నుచ్చారణక్రమంబుగఁ జదివి యాగండపెండేరంబున కబ్బురం బందుచు హంసిని ప్రశ్నించి దానిజననామవిద్యాభ్యాసక్రమంబు విని «మనకోరికలు దీర్ప నీమొలంతయే శరణంబుగఁ గన్పించుచున్నది. కాని వేఱొండుపాయంబుఁ గాన" మని యానీడోద్భవంబునకుఁ దనయనుంగుచెలికలతెఱంగు వివరించి తదాదిగ నప్పటివఱకును బ్రభావతి పొందు

మదనవేదనను దెలిపి యాసలతాంగ గతించిన «హా విహంగమపురంధ్రీ! వేయేల! నీ చెలి యగు ప్రభావతి బ్రతుకు నీహస్తగతంబై యున్నది. చెలియును దల్లి మొదలగుబంధువుల కైనను దనమనోరథంబును దెలుపఁజాలక మాటువరచిన యంశంబును నీ చెంత వివరించుట నీచేత నాళీకదళనేత్ర కాచ్చితాపము మాన్పఁదగునే గాని వేఱు గాదు. ఈసమాచారమును విన్నప్రాణసఖి వైననీవు ప్రాణంబు ధారవోసి యైనను మద్దియము చ్చట దీర్ప కుపేక్ష సేయఁగలవా? కావున సోమరాశమా! నీ వెఱుఁగనిసఖీధర్మంబులు లేవు. ఆప్తజనంబు తోడఁ గుప్తరహస్యంబును దెలుపుచ్చుట మాబోంట్ల భాగ్యంబు ఫలియించు ననుటకు సంశయంబు లేదు. నీసమయోచితవాగ్విలాసంబుచే నీకార్యంబు చక్కఁబడుం గాని వేఱొక్కమార్గంబున సాగివచ్చు ననువాస లేదు. నీవు వేగంబ యట కేగి వాసుదేవకుమారునకు హృదయరంజకంబుగ నీసుందరాంగిసౌందర్యాదుల ననేకభంగుల వర్ణించి యాతనిమనం బీమెయం దత్తుకొనఁ జేసి నీచెలిమనోరథం బీడేర్పవలయు" నని పెక్కుతెఱంగుల వొక్కి వక్కాణింప హంసి విని రాగవల్లరితో నిట్లనియె.

«కడవఁబంటినిట్టి యీ మాపురీసరోవరంబుల విహరించుకలిమి యొలయదుటం జేసి యీ వనితాపేక్షణము గాంచి యాశ్చర్య మంది తగినపురుషుం డెందైనఁ గలఁడా యను సందియంబుఁ జెంది యంతటను సంచరించుచు ద్వారకానగరంబున నాసుందరాంగుని గాంచి తెరగంటి యీసుందరాంగి కీసుందరుండు తగుం దగ్యోసేని సంతసము మద్దగ మందు నని యీ చెలువచెలువంబు నాచెలువుని చెంగటఁ గాలానుగుణంబుగఁ బ్రసక్తి వెంబడి వచియించిన, నాకా దనువాక్యంబు లేమియుఁ జెప్పక యతండు మిన్నకుండె. మామనోనిశ్చయంబుఁ దెలియకునికి నప్పటి కదియ చాలు నని యూరకుంటి" నని విన్న మనను చిపుక్కురవ దనుజరాజకుమారి విషణ్ణవదనంబుతో దీనంబు నొందుట గాంచి, హంసి వెండియు నిట్లనియె. «చెలీ! యింతలో నీ కార్యంబు మునిగిపోనే? చింతింపకుము. నిన్ను వర్ణించునవసరంబునఁ బ్రతివచనం బేమియు లేమిం జేసి యాతఁడుకుమారుని దెత్తుఁ బంపు మని యంతం బోవఁ జెల్లదు గాని సిద్ధసాధ్యవిద్యాధరగంధర్వదనుజకుమారులతో నెవ్వనిఁ గోరినను నిమేషంబునఁ దేఁగలను. తనచే లచియింపఁబడినవానిని మాని యింకొకని వరియింపుట యనుచితంబునకు వ్యాలి లేకం బని యూహింపవలదు.

భక్తచింతామణి యగుభవాని నీయభీష్టంబున కాటంకంబుం గలిగింపం దలపెట్టదు. కావున సంశయాస్పదం బైనప్రద్యుమ్నసమాగమప్రయత్నంబు వీడి నాచేం జెప్పంబడిన వారలలో నొక్కనిం గోరుకొన్నను నీరూపసౌందర్యాదిగుణంబుల వానికడ వర్ణించి మోహపాశబద్ధునిం గావించి నీకింకరునిగం జేసెద. నీరూపసుకుమారాదుల నిందుకయి నీ వెఱుంగవు కాని నీయాకారరామణీయకంబు విన్నవారలు నీయందు బద్ధానురాగులు కాక యుండంగలరా? ఆరుక్మిణీకుమారుండు యౌవనరూపలావణ్యంపు పెంపుచే గర్వించి యున్నవాండు. అతని నల్లె సంతోషింపనిమ్ము. తక్కినవా రతనిపోలినసుకుమారా కారు లనరాదు. కాని సకలలోకసంచారిణి నైన నా కంటంబడనివారెందరో సుందరా కారు లగనంబడుదురు. వారలరూపంబులు పటంబున వ్రాసి తెమ్మనియెదవేని తెచ్చెద. అందు నీయిచ్చవచ్చినమెచ్చుకాని ముచ్చటదీర వరియింపు'' మనిన, నాయంచమాటలు ప్రభావతికి వెగటుగం దోపం గొంతవడవు చింతించి నిట్టూర్పు విడిచి కలకం బారిన మనంబుతో ప్రభావతి హంసి కిట్లనియె. "దిక్పాలకంబును జామాతృదిగం జేసినను బంధంబును ద్రెంపనేరక సమాగమ మెన్నడెన్న(డ)ని దినములు ప్రుచ్చుచున్న నాకుం బ్రాణసఖి వై ప్రియునియుదంతంబుచే నత్యానందంబు గావించిన నీప్రభావాదులం గాంచి నీప్రాపున మనంగలుగుదు నని నమ్మికొనియుంటిని. హంసీ! తుదకు నీవిధంబున విరసంపుపల్కులం బల్కి నామనంబున నాయాసంబుం గలుగంజేయం బాడియే? మున్న వజ్రనాభుండు నన్ను స్వయంవరవిధానంబునకు నియోగించినవాం డై యిప్పుడు నీచేం జెప్పంబడినరాజకుమారులరూపంబుల వేఱువేఱుగ వ్రాసి చూపించెను గాని యానుంద రాకారులలో నెవ్వనిం గోరుటకును మనస్కరించినదికాదు. నాగతి యెట్టు లున్నదియో యెఱుంగరాదు. మున్ను నాతండ్రి రూపవంతు లగువారిని రచియింపుమనునవసరంబున సకలసద్గుణసమేతుం డగునీసుకుమారాకారుని రచియించి చూపుటనికి నీతనిరూపంబును పటంబున లిఖియింపుసమ్మతి లేమిం జేసియో, తా నెఱుంగండో, మానవుం డని వ్రాయ మానెనో, కులవైరికుమారుం డని తలంచెనో యెఱుంగంజాల. ఇవి యన్నియుం దలంచి కుందుచుండిన నేమిప్రయోజనంబు? హంసీ! ఆయాదునందనునందు నామనంబు చిక్కుకొని వీడిపోక యున్నది. భవానిభాషణంబుచందంబు విచారించుచు పరునివాంఛాస్పదు రాల నగుదునో కానో యని సంశయించుచున్నదాన. కావున్న నామనోనిశ్చయంబును దెలుపునాప్రతిజ్ఞావచనంబుల నాలకింపుము. ప్రద్యుమ్ననిం దక్క వేఱొక్కనిం గన్న కానిం గల నైనం గోర. అపురుషపుంగవుండు నాపొందున కియ్యకొనక చెంగనాడెనేని

నా శరీరంబును మన్మథాగ్నిని వేల్చి మఱియొకజన్మంబునం దైన నాతనిం బొందఁ జూచెద. తాకుదిచక్కు నాయభిమానరక్షణంబునకు లక్ష్యంబుగఁ గానుపించుచున్నది. ఏల యన నీవు నన్ను మున్నాతని చెంగటఁ బ్రశంసించుతరి నతం డొంగా దనకుండుటచేతను, జాయాసహితుం డని వచియింపఁబడియుండుటచేతను, నిట్లు నిశ్చయింపవలసె. అతనిఁ జెట్టపట్టినతఱ్ఱ్యాలలామ యేభవంబునను గొప్పతపంబుఁ జేయనోపు." అని శైశవంబున సౌభాగ్యవతి యటంచుఁ బలికినసాముద్రికులవాక్యంబులు కల్ల లని దూషించుచు శుచిముఖిం దిలకించి "యోసఖీ! యంత్యవచనం బొండు వచియించెద. నీయంతరంగంబు తెలంగతింగింపుము. కల్లలాడిన నాతోడు. నాకలవంతలఁ గన్నులారఁ గాంచుచున్న సఖివి గావున నయ్యాదుకుమారుని చెంగటను వేగంబ చేరం జని నేఁ బడుపాటులం దెల్పి నాసమాగమంబున కిచ్చగించునో యిచ్చగింపఁడో యెఱింగి రమ్ము. నన్ను దురాశాపిశాచం బావహించి నామనోనిశ్చయంబును బలపరచుచు జీవితాశం గలుగఁజేసి వెతల కాలవాలంబుఁ గావించుచున్నది. నీవు రయంబునం జని మత్ప్రాణరక్షణం బైన కార్యానుసరణంబును గావించి నన్ను రక్షింపు" మన విని ప్రభావతికి ప్రద్యుమ్నునిపైఁ గలయనురాగం బనివార్యం బని యెఱింగి యాచేడె చెడకుండ సమాగమప్రయత్నంబు జరుపక తప్పినయెడఁ గడుచెడ్డ రోసఁగూడి కార్యంబు చెడు నని తొంకి వడిగ నిట్లనియె. "ప్రభావతీ! నీమనోగతంబు తెలియంగఁ గొన్నియసందర్భవాక్యంబులచే నీ మనంబు నొప్పించితి నని నమ్ముము. నే నీనిమేషంబు వనెచని నీమనోనాథునిం దోడ్కొనివత్తు. నాయవసరంబున నేమికతంబున మాఱు వచియింపక పరధ్యానంబున నుండియుంటివో యెఱుంగను గాని నామహిమఁ జూడుము. తావకరూపసౌందర్యరమావిశేషంబు వినుపించి బద్ధానురాగునిగ నొనరించి విరాళిచేఁ గుందఁజేసెద. దీని కొండొక కారణంబు కలదు. విచారింతు నాలకింపుము.

ము న్నొక్కయవసరంబున శతానందునకు వాచస్పతితోఁ గలహంబు సంభవింపఁ గమలాసనుండు కాంతావియోగసంతాపభరంబును భరియింపఁజాలక యామెకలంకంబును దీర్ప సమర్థు లెవ్వ రని విచారింప, నేను శారద కత్యంతప్రియాస్పదురాల నని విని యామెయొండ మెలంగు నన్నుఁ బిలిపించి తనకోపమలకోపం బుపశమిల్లఁజేయు మని పలికి విరాళిచేఁ గుందుచు మన్మథు నుద్దేశించి "మదనా! గోరముట్టుపై కోకటిపోటు చందంబున నన్నేల బాధించెదవు? నీవును ప్రభావతీస్వర్ణాక్షస్యంబున దిగుల నగలం జాగెదవు. మోరింపుము' మనిన విని నేను రతీనాథునిమానసం బలరించునావినిశ్చయ్యాన

మేపాటిది? రతియాకారంబునకన్న మిన్నగ నుండునా?' యని ప్రశ్నింప నరించి రతిరమణీయు మెక్కడ? ప్రభావతియాకారం బెక్కడ? రతికన్న మూఁడునాలుగింత లధికంబు. ఆమె మదీయసృష్టియందలిది కాదు. పార్వతీప్రసాదంబున నుద్భవించి పెంపొందుచున్నయది. వేఁగ జను' మన నాతండు కాలయాపనము సహింప కుండుట గాంచెంగినదాన నై మీఁదివాక్యం బేమియుఁ దలపెట్టక వేగంబ యటనుండి కదలితి. కాలక్రమంబున నట్టిప్రభావతి యీ వని తెలిసికొంటిని. నీవల్లభుం డగుప్రద్యుమ్నుఁడు నీవర్ణన నాకర్ణించినవాఁడు గాన నాటనుండియు సమాగంబునకై నీకంటె నెక్కుడు త్వరపడుచుండు నని తోఁచుచున్నది. రతియాకారంబు నీపై మోహంబును మరలింప నేరదు. మదికలంక వీడియుండు'' మనిన ప్రభావతి హంసపలుకులకు సందేహంబునొంది రాగవల్లరిమోము గాంచుటయు, నామె తదభిప్రాయం బెఱింగి మరాళి కిట్లనియె. «కాదంబకాంతా! సమయానుకూలప్రసంగసామర్థ్యంబు చేటపడ నేప్రశ్నంబున కార్యార్థంబు సరిపడం బలుకుచున్ననీవచనంబు లత్యాశ్చర్యకరంబులు. మదనుండు ప్రభావతిపై మక్కువచే వెతలంబడుచుండిన మన కరయ్యెడుప్రయోజనం బేమి? మనచెలి కోరినచెలువుం డీమెపైఁ బ్రేమ జూపినఁ గదా మనము సంతసింపవలయు'' ననిన విని హంస మందహాసం బొనర్చి «యువతులారా! మదనుం డన వినియున్నారు కదా! ఆతండు తొల్లిటిరూపంబుతో రుక్మిణీరమణిగర్భంబునఁ బుత్త్రుండుగ నుద్భవించి యున్నవాఁ'' డని వారికంశయంబుఁ దీర నదుత్తరం బొసంగె. నావుడు సురారిసుత యాశలు కొనలుసాగ ప్రియసమాగమాపేక్షతో వేగిరపాటున మరాళబాలికం జూచి «నీపలికినవాక్యంబులు నిక్కువంబు లైన నాపుర మెంతదవ్వో గదా? నీ నరుగు టెప్పుడు? న న్నాతఁడు వరియింపనట్లు చేయు టెప్పుడు? నాయం దనురాగుం డైనను దా నీప్రశంసంబువకుఁ జను జేర జనకు నాజ్ఞ గావలయుఁ గదా? అట్లు రాఁగలిగినను జనకుండు మదీయవాంఛానుకూలుం డై వర్తింపునా? యివి యన్నియు నెరవేరనికలంపు'' లని దైన్యంబు తూలఁ బలవించుచు వెలవెలబోవుచున్న యానసంబునఁ జెంగట నున్నయొక్క భూరుహంబున బంధంబులం జిక్కువడియుక్కుశుకంబు ప్రాణార్తిం దనూరుహంబులం దటతటం గొట్టుకొనుచు నెగయ నుంకించుచుండ శుచిముఖి రాగవల్లరులతోడం బ్రభావతి కదలి వృక్షంబుచెంగట కరిగయంబున నరుగ, రాగవల్లరి భూరుహంబు నారోహించి శుకంబును గదలకుండం గబళించి పట్టి యురి సడలింప కీర మామెహస్తంబులం గరచి విడిపించుకొని గగనంబున కెగసిన కీరపక్షంబులనుండి వెసఁగులాటచే నొకకమ్మ జారిపడె,

దానిం దిలకించి వెఱఁగంది «ఇయ్యది యతివిచిత్రముగ నున్నయది చూచితివే? ఈయంశంబు ప్రమాదకారణంబు గదా? నిశ్చయంబుగ ద్వారకాంతఃపురంబున నెవ్వరి కెవ్వ రంపిరో తెలియుంగ. శుకంబును బట్టి తేనోపుదే మరాళీ!" యని ప్రభావతి పలుక, «అచిరకాలంబున నెంత పోఁగలదు? ఇదే పట్టి తెచ్చెద" నని పంతంబున హంసి దాని నిమ్నంటి యరిగిన, దానఃపుత్రి రాగవల్లరిం జూచి «చెలీ! యీప్రదేశంబున మరు లేవ రొడ్డిరో యాశ్చర్యంబుగ నున్నది" అన, రాగవల్లరి «సఖీ! చెలికి చీదరఁ గొలిపెడు శుకపికాళిని శిక్షించు నెపంబున నే నొనరించినయపరాధం బిది కావున క్షమియింపుము. ఓచంద్రవదనా! యీలేఖచందం బత్యద్భుతంబుగ నున్నయది. ఏది చదివి చూతు" మని యామెహస్తంబులనుండి పత్రిక నందిపుచ్చుకొని విప్పి యీవిధంబునఁ జదువ నుపక్రమించె.

«శ్రీమత్సకలగుణగరిష్ఠవిద్యావిశారదశారదాంబాకృపాప్రసాదసంభావిత, యనుపమానితయౌవనశ్రీకామధేనుబిరుదాంకిత, సరసవాక్యవిశేషసంప్రియయుక్తరమణీయనూపురసంశోభితాలంకారవామపాద యగు శుచిముఖీ నామధేయకు ప్రద్యుమ్న దతికుతూహలంబున వినయపూర్వకంబుగ రచియించి పంచినహాస్యపత్రిక:—

ప్రియప్రభావతియాకారగుణసౌందర్యాదుల నీ వత్యంతరమణీయంబుగ వర్ణించు"- నని చదువుచునె యపరిమితానందంబున నుబ్బి తబ్బిబ్బై శరీరంబు పులకరింపఁ బ్రభావతిం గౌఁగిలించి «నీ వపరిమితభాగ్యవంతురాలవు. ఇది నీనిమిత్తమై ప్రియుం డంపినలేఖ" యని రాగవల్లరి పలికినఁ బ్రభావతి «చెలీ! నీవు చదివినయట్టి పత్రికయందుఁ గలదా? నను వంచించుట కిట్లు పలుకుచుంటివా? ఏది యిటు చూపు" మని చేరఁ జని చేయి చాచిన, నామె కొంతదూరంబుగఁ దొలఁగి «నీ దేవునితోడు? పత్రికయందలి సమాచారం బామూలాగ్రంబుగఁ జదివెద వినుము. అనంతరంబు నీకొందువుగాని" యన్న ప్రభావతి చెలిం జూచి «యూరకుండె వ్రాసె నని నిశ్చయించినను ప్రియప్రభావతి యనుకన్య యెవతియో? నా కేల నమ్మకము. ఇంతకు నిలచి పఠించి చూడు" మన రాగవల్లరి ప్రభావతి కిట్లనియె. «ఇయ్యది నీనామంబే యనుటకు సందియంబు లేదు. సమాగమవిలంబనసంతాపభ్రాంతిచే నీవిధంబున నన్నుపమ[illegible] వ్రాసినవాఁడు గాని వేఱుకాదు" యన విని «మిత్రురాలా! యిటువంటి [illegible] మిగిలినభాగంబు వేగంబ చదువుము. నే నిచటనే యుండెద" ననిన రాగవల్లరి [illegible] చదివెద నాలకింపు" మని మరల నిట్లని యారంభించె.

ఇట్టిప్రభావతీయాకారగుణసౌందర్యాదుల నీ వత్యంతరమణీయంబుగ వర్ణింప నే
నెమ్మియు ప్రద్యుమ్నుని మొసంగకుండుట కపటనాటకంబు గాని కాంతపై మక్కువలేమిం
జేసి కాదు. నీ వరిగిననాటనుండియు మోహజలంబుల మునింగి సమాగమం బెన్న డెన్న
డని యుత్కంఠాయుతమై దివసంబులు లెక్కింపుచుంటి. అనుగ్రహించి యాపాలంతి
చూపొందున కనుమతించున ట్లనునయించి నన్ను ధన్యునిం గావింపు" మని చదివి విరమింప,
ప్రభావతి రయంబునఁ జెలిచేతిపత్రిక చిత్రంబుగ నెమరుపాటునఁ గైకొన, రాగవల్లరి
మొనగులాడిక విడచి "నేను జదువఁ దగను గాబోలు. అవును నీమనోహరుండు
తనమక్కువ తేటపడుమాటల నేమేమి వ్రాసినాడో? వాని పెల్ల వెనుకనుండి ముచ్చటదీరఁ
జదువుకొను" మని పలుక, ప్రభావతి మనంబునఁ గోపలజ్జాసంతోషంబులు పెనంగొనఁ
జెలిని జంప సంకింప, రాగవల్లరి బిట్టుగ నొట్టుల నిడి "యౌవనగర్వంబున నెంతపని
జేయఁ బూనితే నురారియాడుబిడ్డా! నీ చేలతనంబు చాలుచాలు. మేలు పదివేలు వచ్చె.
నీ బాలిశత్వంబు మాని దాని నాచేతి కొసంగుము. ఒసంగవేని బదిలంబుగ దాచుము.
అది కాక యీలేఖకును నీకును సంబంధ మేమి? అనుగుణుండు శుచిముఖి పేర లిఖి
యించి పుత్తెంచె. ఆకారణంబ కాంతకంటెఁ బదకుండ కమ్మ నమ్ము చేయుట విహితమ్ము
కాదు. దానితో మన మొనరించిన కార్యంబునకు ఫలం బిచ్చెరు కాబోలు. నీవ యూహింప
వలయు. నీవక్రోశ్వం చే మని వచియింప? వల్లభుండు తనప్రేమ తేటతెల్లంబుగ లిఖి
యించి పంచిన దాని శుభవతు లిలవేల్పుంబలెఁ గొలిచి సంతరించుట యుక్తంబు గాని
భగ్నంబు నొందించుటకన్న యమాంగళ్యంబు లోకంబునఁ గలదే?" యని యదలించి
లాలించి వారించె.

అప్పుడ వారంశి సమీపంబునకు శిరంబున దారవించి దానిపక్షంబులఁ దనపాదం
బులం గీలించిన వది పిచ్చలించి కిమకిమ మని రోలింగింపుచుఁ బెవంగుచుఁ జరణంబులం
గరచుచుఁ జనుదేర జీకాకుపరచిన, "ఓరీ రాజకీరపులుగా! నీ వేపడారిగాయకపుసుద్దు
లటుంచనిచ్చి నావెంటఁ జనుదెమ్ము. పక్షంబుల నిమిడింపుకొని రెక్కడిరేఖల నెక్క
డికి రహస్యంబుగ నడపుమన్న దానవు? రాకుసరాజపుత్రి నిన్ను బట్టితెమ్మనంత
దనుక నల్లచ విరిత్తుంపుచున్నది." యని పలుకఁ గీరము "నన్ను బంధింపం జంపుము
గాని యామె చెంతకుం గొనిపోకుము. నన్ను నీ విచ్చటఁ జంపిన నాతోడను యీవార్త
పెల్లఁ దీరుఁ గాని నీ వాచ్ఛిదేశంబునకుం గొంపోయిన నెందఱకుఁ గీడు మూడనున్నదియో

రేయుంగరా" యనుటయు, హంసి "నిను బోనిచ్చినను భయంబు లేదు." కమ్మ మూశేఁ జిక్కినది. అయినను వెంట రమ్ము. రావేని నీ కాయాసంబు దక్క నీ విడిగలుంబడి రాకున్నను విడువదాన గాను. అరుదెంచితివేని రాచకన్యమనంబునకు జాలి గలుగఁ జేసి నిన్ను విడిపించెద" నని బలిమిచేఁ గొనిపోవుచుండ, మరాళంబును గని కీరంబు "ఏల నీ కీపంతంబు? నారహస్యంబులు నీవు వినఁగోరదవేని వివరించెద. రహస్యంబును వెలి-పుచ్చుట కీవు ముగ్ధవు గావు గాన భయంబు లేదు. ఇచ్చట దాచినను నామొకడ కీవు కొనిచనిన నారహస్యంబు తేటబడుటయు నాప్రాణము పోవుటయుఁ దటస్థింపక మానదు. సావకాశంబుగ నొక్కయిరవున నిలిపి నావిన్నపంబును విని నీ వేమి చేయ నమునుతింతువో యట్లు జరుపు" మన, మరాళి యప్పటి కదియె యోగ్యంబుగ గ్రహించి సంతసించి నలుకెలంకులం బరికించి సమీపంబున నెచ్చటఁ జెట్టుగుట్ట లేనిగట్టుచిట్టచివరం బెట్టి "శేఖసమాచారంబు తేటపడఁ జెప్పు" మనుటయు కీర మిట్లనియె. "ద్వారకాపురంబున నే నొక్కకారణంబున నరిగి తిరిగి వచ్చునవసరంబున నుంద రాకారుం డగునొక్క రాజకుమారుండు వ్యాకులచిత్తంబుతోఁ గీరశారికాపరభృతషట్పదంబులం జేరి 'మీరు వజ్రపురికిఁ బోవువారె' యని పలువిధంబులం బలవించుచు నామాటలకు మాఱు పలుకఁ డని ప్రార్థించుట నాలించి, 'నే నాపురంబున కరిగెద. నాచే నయ్యెడుప్రయోజనంబు వినిపింపు' మన నుత్సాహపూరితుండై యాతండు నన్ను వీక్షించి 'యోశుకవంశసంజాతిమాడామణీ! నీవు నా కొనరింపఁగలమహోపకారం బొండు కలదు. వివరింతు నాలకింపుము. వజ్రపురంబున శుచిముఖి యను పేర నొక్కహంసి కలదు. ఆకమ్మ యాకొమ్మ కి'' మ్మవి వేమఱకుఁ, నామిమ్మైకానిదీనత్వంబు దలంచి నెమ్మనమ్మ దయాభరవశతం జెంద నే నాఁగాములు విచారింపక కమ్మ కాదంబకాంత కందించుటయె గదా! దీన నేమిముప్పు వాటిల్లు నని యెంచి ధీరత్వంబునఁ గమ్మ పక్షంబులమయింగున నడంగియుండునట్లు గట్టించుకొని చనుదెంచి యాయామవనప్రాంతసరోవరంబునఁ జక్రాంగంబులసంచారసంరాజ మాలించి యెగుదెంచుచు సఖ్యంబుగ సారసాతులసమీపంబున సంచరించుచున్నం గాంచి శుచిముఖిసమాచారం బేమైన నెఱుకపడు నేమో యనుతలంపున నామహీరుహంబున వ్రాలి బంధంబుల జిక్కి "యీవిధంబున నీచే బాధలకుఁ బాలుపడితి" నని వచింప, మరాళి యది తనకార్యంబుగ గ్రహించి సంతోషంబున దిగమ్రింగి తనపేరఁ బత్రికం బంపువాఁడు సాహితుండు కాక మాఱఁ డని యాపత్రికసమాచారంబును దలఁచి యడుగక

«నీ పాత్రంబునకుం జనఁ బని యేమి కలిగెనో? యథార్థంబు వచింపు" మన, కీరంబు సంకో-
చంబునఁ గొంకియుండె. నావుడు మరాళి దాన నేదియో విశేషంబు గల దనుతలంపునఁ
బాదంబులం గలకీరంబును బిగింప, నది «నాప్రాణంబును బోఁగొట్టుకొనుట కైన సను
మతింతుఁ గాని నీవు గట్టిప్రమాణం బొసంగినం గాని యారహస్యంబు వెలిఁ బెట్ట
నిచ్చగింప" నని బింకంబున నుండ, మరాళము «మేలు. కీరమా! మేలు! మాననీయు లగు
వారు నవనిధానంబు లొసంగినను, కుత్తుకం గత్తి హత్తించినను, పోషకులరహస్యభంగంబున
కాసంతయు సమ్మతింపరు. అట్టినీరహస్యంబు వెలిబుచ్చిన నా కేమిలాభంబు? దేవునాన!
వెలిబుచ్చ" ననుటయు, కీరము మరాళముం గాంచి యిట్లనియె.

«వజ్రనాభునకు సునాభుం డను ననుజుండు గలఁడు. అతనిగర్భవాసంబున నతి
సుందరాకారు లగునిద్దరుముద్దియ లుదయించిరి. వారు చంద్రవతి గుణవతి యనునామం
బుల వరలుచున్నవారు. నారదుండు సంచారవశంబున నొక్కనాఁడు సునాభునిమంది
రంబున కేతేర, సునాభుం డాతని సకలవిధసత్కారంబులచే సంతృప్తుం గావించి పరిచార
కులతో దేవేరు లుండుభవనంబున కనుపుటయు, వా రాతనియాశీర్వచనముల నందుటకు
దగినట్టుల మునీశ్వరుఁ బూజించుచుండ, చంద్రవతీగుణవతులు వినయపూర్వకంబుగ ముని
సింహునియొండ కరుదెంచి నమస్కరించిన నాతండుఁ 'పతులం బడసి పుత్రవంతులరై
సుఖంబులఁ బడయుఁ' డని దీవించె. అంత నచ్చటిదాదు «లోమునిచంద్రా! యీసుందరీ
మణులను వరించుసుందరాంగు లెవ్వరో వారినిఁ జేర్కొనుం" డనుటయు, మునియుఁ
గొంత చింతించి తల పంకించి విమలయశోధనులును, ద్వారకాపురీవాసులును, యదువంశ
సంభవులును నగుగదసాంబు లనువా రీపూబోఁడులకుఁ బతులు గాఁగలా" రని వచించిన,
నాతనిభాషణంబునకు వారు భీతి చెంది «కుడిచి కూర్చుండి వెతఁ దెచ్చుకొంటిమి. ఎక్కడి
ద్వారకాపురం బెక్కడిగదసాంబులు! అప్పురం బసురవిరోధికిఁ గాపురం బని విందుము.
ఈసమాచారంబు సునాభునిచెవి సోకనేనిఁ గీడు మూడకమాన" దని యాసమా
చారంబును వెలిఁబడనీయక యడంచిరి. సునాభపుత్రికలు లావలుకుల నాలించినవాట
గోలె మనంబులఁ గోర్కులు కొనలుసాగ బద్ధానురాగచేతస్కలై చింతచే నందురుచుండ
నన్ను వినోదంపుచెలిగాఁ జేరిమంబునఁ బెంచుచున్నకతంబున నే నామదవతులమనంబు
మన్మథాయత్తంబున మఱుగుచుంట మాటలక్రమంబునం గనిపెట్టి «మానినులారా! నను
సాకుచున్నమీకు మేలు చేయవలె ననుతలంపు నాకు వొడమినది. మీప్రేమాస్పదు
లగువారిక్షేమంబు నెఱింగి యాద నైనయెడ మీమనోవాంఛలఁ దెలియం బలికి ప్రత్యు
త్తరంబుఁ దెత్తు నంపుఁ" డని నాక్రుచ్చి యవ్వారువుహోత్తులు నాయెడబాటున కియ్య
కొనుటన్నను విపులప్రియక్కతన వినుఁడు గమనోన్ముఖు నై కదలి ద్వారకకుం జని

తోంట నచ్చెను. అచ్చట విద్యుద్దీపద్యుతులనిశ్చితార్థంబును గప్పుచుచ్చు మెచ్చుకొనుచుండె పత్రికత్తెర మనసంగెద: స్వేచ్ఛగఁ బ్రవర్తింపుఁ'' అనిన నవ్వాక్యంబుల విని మానవతి అత్యంతానురాగంబున మునిఁగి, హాంసి వారలచే వీడ్కొలుపంబడి ప్రభావతియుండు తోఁ ప్పృచుభామణంబుల "చెలువా! నీభాగ్యంబు నే నేమని వర్ణింతును? విచారింప నీపతి నీపై ననురాగంబుచే నంపినలేఖ యని తెల్లంబయ్యె'' నన రాజపుత్రి "యేది యాకీరంబునే ప్రతి కీటకుఁ దోడితేక విడచితివి? అదుష్టవలసినదాని నెల్ల నడిగి పత్రికాక్షరంబుల వడసితివా? ఆకీరంబునకు నివాసం బెయ్యదియో, ద్వారక కేమికారణంబున వచ్చినదియో తెలిపినదియా?'' యనుటయు శుచిముఖి వారలం గాంచి "నా పేర నీపతి వ్రాసినకవ్య నీపైఁ బ్రేమచే రచియింపఁబడిన దని కీరంబువలన నెఱింగి సంతోషించితి; దానివిచారణ తోలే? మన కందఁజేయవలసినపత్త్రిక యొరులచేఁ బడకుండ మనచేఁ జిక్కుటయే మనకుఁ బదివేలు. రాగవల్లరీ! చదువుకొంటివే! ఆపత్త్రికయందు నేను విన్నచందంబున నున్నదియో లేక వివరంబున నున్నదియో!'' యన రాగవల్లరి "కమ్మయందు నేను బఠించినసమాచారంబు నీవు విన్నచందంబున నే యున్నది. నేఁ జదువఁగూడ దని కాంబోలు ప్రభావతి పత్త్రిక కాడివిపట్టి బలిమిని పుచ్చుకొనిరి'' నన మరాళి "యది న్యాయంబె! మీఁదియంశంబు మనకుం దెలియఁ దగినది కాదు. అనన్యప్రేమంబున నానందరూపుఁ డేమేమి రచించి యంపినవాఁడో! వాని నెల్ల వానిపతియె తిలకించి సంతోషసంపద లనుభవింపనిమ్ము. 'ప్రభాప్రభావతి' యని రచియించినమేధావి యేమి వ్రాసినను వ్రాయఁగలండు. ఆశ్చర్యము! ప్రాఁశ్యమీనుందరిని వర్ణించుకారణంబునఁ దా నభావంబుగ మాటలాడి కనుకంటనే చేపట్ట నెంచుట కార్యానుకూలమూలకం బయ్యె. యౌవనంబున నున్న ఘనామదవతియావంబును వర్ణింప విని సుందరుం డాళ లేనివానివలె నటించుట కాతని చందంబు లెలయు; కులశీలము తెలియుట కొఱకరంబుకే? అట్టివాఁ డోడంబడుటచే నీచెలి కోరిక నెరవేఱుట నిశ్చయం'' బనిన విని ప్రభావతి హాంసి కిట్లనియె. "అతం డనుమతించినను నాజనకుం డాతనియొల్లునంబున కియ్యకొనవలయుఁ గదా? వజ్రనాభుని యనుజ్ఞ లేనిదియు యాతం డీపురంబుఁ జొర ననువుపడదు. ఇంక నాకు సంకల్పసిద్ధి యెట్లు?'' అని దిగులొందుమగువం గాంచి శుచిముఖి "సౌమ్యగరాజమధ్యా! నీపలుకులు నిశ్చయంబులు. నీవిభునియాగమనంబునకు నీతండ్రియనుజ్ఞ సంపాదించుసామర్థ్యంబు నాకుఁ గలదు. ఆకార్యసాఫల్యంబునకు మీజనకునిసఖ్యంబు ముఖ్యంబు. సమయం తెలిసిఁగి నన్ను మీనాయనకడ వర్ణించి సముఖంబునకు రప్పింపఁ జేసితివేని, మీఁది

కార్యంబు బుద్ధివిశేషంబుచే నడపెద. దైవంబు తోడగుం గాక! పోయి వచ్చెద. యుపవనసరోవరంబుననే వర్తించుదాన. పనిపడినం బిలిపింపు'' మని పలికి చనియె.

అనంతరంబు ప్రభావతి జనకుని చెంగటం బ్రసంగవశంబున "మానససరోవరంబునం జరియించు జలచరంబులలో శుచిముఖి యను హంసాంగన విద్యావివేకంబుచే వెలయుచున్నది. దాని చాతుర్యంబును విని తీరవలయు'' నని ముచ్చటింప, దానవపతి పుత్రికమాటలు ముద్దుసేయుచు "అమ్మ! చూతము. మరాళిని రప్పింపు'' మన నట్లనె రప్పించి, "శుచిముఖీ! నీవిద్యావైశారద్యంబును వినవలయు నని మదీయజనకుండు వేడుకపడుచున్నవాఁడు. వివరింపు'' మన నదియు నమృతంపుసోన లొలుకు మృదుపదంబులచే వ్యాసగౌతమకాణాదసాంఖ్యశాస్త్రాంశంబుల నుడువుచు, బాధకంబులం బూర్వపక్షంబుం జేయుచు మతభేదంబులం గ్రోడీకరించి సిద్ధాంతంబుం జేయుచు, మతస్థాపనంబున న్యాయం బవలంబించి యన్యాయమతంబుల దూషించుచు, సకలశాస్త్రంబులమహిమల నగ్గడించి దానవుని వ్యామోహితుం జేసి యాతనిచే బాపురే యనిపించుకొనియె. కతిపయదివసంబులు గడువ వజ్రనాభుండు శుచిముఖి నవలోకించి "వింతలేవైనం గలవేని తెలియం బలుకు'' మన నాయంచ యించుక యోచించిన ట్లభినయించి "యెంతెంతలు చోద్యంబులైనను గనివినియుంటిని గాని యిట్టివాని నెందును జూచినది లేదు. విన నవధరింపుము. భద్రుం డను నటుని నాట్యవిద్యాకౌశలంబు చూడందగ్గదియె కాని వచియింప సాధ్యంబు గా'' దన విని యాతండు జూడ వేడుకపడి నటునిం బిలువు మన నట్లె యని ప్రభావతితోం బోయి వచ్చెద నని యామె తన్ను వెంబడింప "మదవతీ! నీమక్కువకాని నిట దెచ్చు నిమిత్తమే సుమీ యీపన్నుగడం బన్నినదాన'' నని పలికి సెలవు గొని ద్వారకకుం జనియె. అట కృష్ణునిం గాంచి నటునిం దెత్తు నని వచ్చుటయు, సునాభతనయలు నారదవచనానుసారంబుగ గదసాంబులం బరిణయంబు కానుండుటయు నెఱింగించి దానవసంహారంబునకు వీరిరువురు ప్రద్యుమ్నునకుం దోడుపడం బనికివత్తు రని తెలిపి గోవిందునియభిమతంబును విని తదీయమతానుసారంబును బురంధరునకు విన్నవింప నాకంబున కేగుచుం బ్రద్యుమ్నునికడ కరిగి,

హంసి—చిలుకచేం బత్రిక నంపితిరే!

ప్ర—అది నీ కందినదియా?

హంసి—ఎవ్వరిం గూర్చి యనిపితివో వారికే చేరినది.

ప్ర—ఆలేమ శుభంబుగ నున్నదియా?

హంసి—ఉన్నది నీపై ప్రేమచేఁ గుందుచు.

ఈవిధంబున హంసి దానవపుత్రి తెఱం గెఱింగించి "మాధవపుత్రా! మున్నామె రూపంబును వర్ణించునపుడు నీమనంబు తేటబడమిం జేసి యప్పటి కదియె చాలు నని యూరకొంటిని. ప్రభావతి యన్నదో పార్వతి యొసంగినచిత్రఫలకంబునం గలనీరూపంబునకుం దనిసి నిన్ను వరింపఁ దమకపడుచున్నది. నీకమ్మ యాక్షణంబున నందియుండదేని నింతకుమున్నె పంచత్వంబు నొందియుండును." అన విని ప్రద్యుమ్నుండు హంసితో "పోఁగలుగుదునేని యొక్కలిం గట్టుకొని యైన నాప్రదేశంబున వ్రాలవలయు నని యున్నది. ఏమి సేయుదు? ఆపురంబు వాయసురునియనుజ్ఞ లేక యేవారికిని జొరవశక్యంబు గాదని వినియుండుటం జేసి వెనుదియ్యవలసె. అది యటుండ నిమ్ము. పురందరపురుషోత్తములచే యోజింపఁబడుకార్య మే మయ్యెఁ దెలుపు" మన మరాళి యాతనిం గాంచి "కుమారా! యాపురప్రవేశంబునకై చింత యావంతయు వలదు. ఆయుపాయంబు సర్వంబును నీజనకుండు స్థిరపరచియున్నవాఁడు. వజ్రనాభసంహారసాధనంబును నీయిష్టకార్యనిర్వహణంబును గలసి రా నిన్ననుపునట్లు నిశ్చయపరచితి. అందువిషయమై నీజనకుఁడు నిన్నుఁ బిలిపింపనున్నవాఁడు. ఈసమాచారంబు వజ్రికి విన్నవించి వజ్రపురంబునకుం జని తావకీనకార్యానుసరణబుద్ధిం బ్రవర్తింపుమఁ దుద నెగ్గించెద" నని పలికి యటనుండి కదలి చనియె.

పిమ్మట దేవకీనందనుండు ప్రద్యుమ్నగదసాంబులను బిలిపించి నిర్జరహితంబునకై వజ్రనాభనిర్మూలనంబు కర్తవ్యం బని పలికి నియోగించి యాపురంబు బిత్తరులు చొరనసాధ్యం బని తెలిపి పురప్రవేశంబునకు కాదంబకాంత చెప్పినయుపాయంబుఁ దెలిపి ప్రద్యుమ్నుండు భద్రాఖ్యరూపంబును గదుండు సూత్రధారియాకారంబును సాంబుండు విదూషకవేషంబును దాల్చి పురిం బ్రవేశింపుఁడని పనిచిన, వారును బరస్పరసంతోషంబులతో నాట్యసామగ్రి సమకూర్చుకొని వజ్రపురప్రాంతశాఖానగరంబుల నాటకప్రయోగంబుల నెరపుచుండ, వజ్రనాభుండు విని వారలఁ దనపురంబులోనికి రప్పింప, వా రదనెఱింగి రాజుం దర్శించి నాటకము లాడ మొదల గొని రంగస్థలం బేర్పరచి యాట లాడనున్నతరి, శుచిముఖి యరుదెంచి ప్రభావతీసంద్రితీగుణాంతులకు పతులరాక తెఱం గెఱింగించి ప్రద్యుమ్నునికడ కేగి ప్రభావతి నీనాట్యంబును హర్మ్యంబుపై నుండి చూచు నని యొక్కమేడం జూపి చనియె.

వజ్రనాభుండు మిత్రబంధుసందోహంబుతో రంగస్థలంబునకెదుట సౌఖ్యాకరంబుగ సభ నలంకరింప, కపటనాటకసూత్రధారి యదుగదుండు వచ్చి నాట్యారంభమునకై పంచమషడ్జమస్వరస్థాయిల కనుసగురీతి గాత్రంబున శ్రుతిమేళనంబు గావించి మర్దళనాదంబు రసపుష్టి సేయ డెబ్బదిరెండుమేళకర్తలకళలను జూపించి నాంది ముగింప ప్రద్యుమ్నుండు దాని నందికొని సప్తతాళయుక్తంబుగ నడపించుచు విషమతాళగతులఁ జూపించుచు స్వరయుక్తంబును దప్పనీక మెలంగి గంగావతరణాది పెక్కు నాటకంబు లాడి నర్తకుల వ్యామోహితులం జేసి వారిసర్వస్వము సూచముట్టుగా దోచుకొనుచు మరాళవాక్యంబు మది నుంచి మేడపంకఁ జూపు నిగుడించుచు నామానవతిని మెప్పింపఁ గాంచి శ్లేషార్థంబుగ నిట్లనియె.

“సకలకళలచే నొప్పారినయో నెఱజాణ వజ్రనాభ కులావతంసరత్నమ ప్రభావతి గోపితకంటకం బగునీమా పనురాగసహితంబుగ నాపైఁ బర్వఁ గాన నానుకృతంబు నేఁడు ఫలించినది. హంస చెప్పిననాఁటనుండియు నిను భజింప వేడుక పొడమినయది. నీయాడికంబు మనంబున కెక్కఁగఁ జేసి యిష్టానుసారంబుగ మెలంగెద నేలికొను” మన ప్రభావతి విని లజ్జచే మొగంబు వంచుకొనఁ దదీయసామీప్యవర్తి యగుచకాంగ తొయ్యలి యనురనాయకతనూజఁ గనుంగొని “వింటివే! యాతనిమదిం గనుఁగొంటివే! యామాటలయందలి యర్థద్వయచమత్కారంబు!” అన ప్రభావతి హసించి కిట్లనియె, “విచ్చలవిడిగ నామంబును జేర్కొని నీపై నిచ్చచే వచ్చితి నని తెల్లంబుగ ముచ్చటించె, ఇందు విశేషార్థం బేమి గలదు? ఒరులు విందు రనుభయం బించుకయు లేక యెల్లరకుం దెలియునట్లు పెల్లుసిగ వచింపుటచేఁ జిత్తచాంచల్యంబు పొడమినయట్లు పొడకట్టెడిని. నాకధికృతం బెటు లున్నదియో యెఱుంగఁ జాల” నని చింతింప శుచిముఖి యాళి ముఖినిఁ గాంచి “యతివా! నీప్రియుం డతిజాణ. నీ కట్టిచింత వలదు. నీజనకాదుల కష్టం బగురీతి వారికిని, నీకు సంతోషం బగురీతి నీకును నర్థద్వయంబుఁ గల్పించి వచియించినవాఁడు. ఎఱింగినదాన నగుటచే నీ కీయర్థంబు తేటఁబడెను కాని యితరు లీ యర్థంబు గ్రహింపఁ జాలరు, ఈపలుకు లితరులు విని రనుశంక యావంతయు మనంబున నుంపకుము. నాట్యావసానసమయప్రార్థనంబునకై పలికినపలుకు లగుటచే రాజుచే సన్మానింపఁబడి ఒడిదె కనుఁబడుచున్నవాఁ” డని రాత్రి గేయుం జూపిన ప్రభావతి శృంగారవిదూషిచమత్కారప్రసంగంబును వీనులవిందుగ నాలకించుచు రాగవల్లరీసక్తా

తంబుగ నివాసంబున కరిగి ప్రియసమాగమకాంక్షచేత నూటలూరుచుండ ప్రద్యుమ్నుం
డును సమాగమకాంక్షచే రహస్యంబుగ ప్రభావతియంతఃపురంబునకుం జని మక్కువచే
దనకుం దక్కనెంచిన చక్కరబొమ్మ చక్కదనము ప్రత్యక్షముగఁ గాంచి సొక్కి యా
యిందీవరదళాక్షిని శుచిముఖీరాగవల్లరులసమక్షంబున గాంధర్వవిధానంబున హంసి
«ప్రియాంముహూర్త స్సుముహూర్తోస్తు» యనఁ బరిగ్రహించి నాఁటిమొదలా మద
వతితో సంసారసౌఖ్యంబున నోలలాడుచుండ, చంద్రవతీగుణవతులు తమపతులతోఁ
గలయుటకు నుపాయంబు గావలె శుచిముఖితోఁ దెలుప, వారలకోర్కి నెరవేర్పఁ దలంచి
ప్రభావతీవర్ణనమిషచే ప్రభావతి లలితమగు ప్రియసమాగమవేషంబు చక్క దిద్దుకొనక
ముప్పు నెంటఁగొని రా, వార లామెచందంబును గాంచి సందియంబు మది గదురఁ
గ్రమంబునఁ బురుషునితోఁ గలసినక్రమంబు గనుపట్ట కొండొరుల మొగంబులఁ జూచు
కొని నర్మవాక్యంబులచే నాలీలావతిని హేళనంబుఁ జేయుచుండ ప్రభావతి విషణ్ణవదనం
బుతో భయలజ్జాలోలయై ప్రత్యుత్తరం బేమియుం దోపక యుండ మరాళి యామెకు
దనచెలియండ్రరహస్యంబు వెలిపుచ్చ కున్న ప్రభావతి తలంకపాటు వీడకుండుటయే
కాక వీరియభిమతము గూడ నెరవేరదో యని విచారించి యిట్లనియె, «అతివలారా!
మీ లీల యీలీల హేళనంబుఁ జేసెదరు? మీరు చదివినచదువె యామెయుఁ జదివినయది,
మీకంటె వయోవృద్ధురాలు గావున పెద్దపిన్నవరుసచే నామెకోర్కి మొదటఁ ఫలించినది»
యనుటయుఁ బ్రభావతి తెలివిఁ జెంది హంసిం జూచి «యే మేమీ! వీరలగుట్టును నీచేఁ
జిక్కినదియా? దాని నామూలంబుగ వాకొణింగింపు» మనుటయు, హంసి తన్నధిక
లజ్జాభయంబులచేఁ గనుసన్నలచే వలదని వారించుచున్న చంద్రవతీగుణవతుల నాలోకించి
వచియింప శంకించుటయు, రాజనందన తనపై నాన లిడుచు విడుపక పీడించుచుండ
మరాళి వారల నవలోకించి «మీర లెంత దాచినను బయలుపడక మానదుఁ
దీగఁ దీసిన డొంక కదలు ననుట మీరు నెఱుంగుదురు గదా, అనఁ గట్టి యడఁగు
చుండ దాఁప నేట్లు?» అని ప్రభావతితోఁ బ్రద్యుమ్నునిలేఖ సంతరించుకొని వచ్చిన
చిలుకనుడులు మొదలుకొని వారియత్నంబు సకలంబును జెప్పినఁ బ్రభావతి నవ్వుచు
సిగ్గునఁ దలవంచినముద్దియలం గని «ముచ్చులారా! మీరహస్యంబును గప్పిపుచ్చి నన్ను
హేళనఁ జేయుచుంటిరే! మీరును నాతోడిదొంగ లైతిరి. ఖిన్నతుండుఁ» డన వాయిం
చిత శకుంతకాంత యిట్లనియె, «లలనా! వీరును నీతోడివారలె గావున నీవు పూనికొని

నీప్రియునితోఁ జెప్పి గప్పింపవేని వారికోర్కి కొనసాగదు. నీవు పతితో నీయంతయు వచియింప సిగ్గుపడి యూరిన నేఁడె నేను నీవల్లభునితోడఁ జెప్పెద" ననఁ బ్రభావతి యంగీకారసూచకంబుగ కనుసైగ సేయ గ్రహించి సునాభతనయలం గాంచి "ప్రభావతికిఁ బతి యైనవాఁడు మహనీయుం డగుదివ్యపురుషుం డగుటం జేసి యాతనియనుగ్రహంబునం దక్క తక్కినయుపాయంబుల నీయంతిపురంబు మీవరులు చేర ననువుపడ దని యెఱింగినదానఁ గావున నిట్లు పలికితిని. ఇఁక మనమునం గలకొండలంబును మాని కొంగుముడివేసికొనుఁడి దే నేటిమాపటికి మీపతులతో మిమ్ముఁ గూర్చెద" నని పలికి లజ్జాసంతోషంబులతో ముదమందువారిని నిజనివాసంబుల కనిపె. ఈవిధంబున హంసాంగన యామింపఁబోఁదుల నమ్మించినదియై నాటిరాత్రి యాదవులవిడికిం బోయి యేకాంతంబున ప్రద్యుమ్నగదసాంబుల నొక్కచో నిలిపి "మీయందఱకును దలాయొక కార్యంబు గలిగి వచ్చితిరి గావున మీమీకార్యంబులు నెరవేరినఁ గాని నాకస్వామి కనుకూలంబు కా" దనుటయు, వారు మువ్వురు "తలాయొకకార్యంబు కల దని వచియించె. నావలె గడమయిద్దఱకును నిజార్థంబు కల దేమో?" యని తమతమమనంబుల సమంబుగఁ దలపోయం దొడంగిరి. శుచిముఖియు వారియభిప్రాయంబు లెఱింగినది గావున "మీమీ ప్రత్యేకార్థంబులు మీలోఁ బ్రతివారికిని దెలియ వేమొ? వినుం డని వారలం గోరినవనితల తెఱంగును వారిప్రేమలవిధంబును వివరించి ప్రద్యుమ్నునిం జూచి "నీ వొక్కండ వీరిందుఁ గడునేర్పరివి. కావునఁ గాంతాసంయోగంబుఁ గాంచితివి. తక్కినవా రాతురతతో సకులం గలియఁ దోఁపఁ గానకయున్నవారు. వారలకార్యసాధనంబు నీహస్తగతంబున నున్నది. కావున నీ వందులకుఁ దగినయుపాయం బూహింపు" మనియె. అప్పుడామువ్వురు తమతమరహస్యంబులు వెలువడిన నని నవ్వుకొని యొకరి నొకరు "నీవు నాపవుకార్యానుసరణబుద్ధిచే వచ్చితి వనుకొంటిని. ఇదియా విశేషం" బని యెత్తిపొడువ, నాతండు "నీవును దాని నిమిత్తమే వచ్చితివి గాఁబోలు! మేలు! మెచ్చుకొన వచ్చు" ననిన, "మఱి నీ వెందులకో" యని సరాగంబు లాడుచుండ, ప్రద్యుమ్నుండు శుచిముఖిం జూచి "నీవు వెంటనె సునాభతనయలకడకుం జని మీహృదయేశ్వరు లిదె వచ్చెద రని యారడింపు" మని యనిపి తానును గదసాంబుల వారాత్రి తాను జనుచున్నరహస్యమార్గంబున దానవాంతఃపురప్రవేశంబుఁ జేయించిన వారును దమ్ముఁ గోరియున్నవరవర్ణినుల గాంధర్వవివాహంబునం బరిణయం బై సకలవిధసుఖంబులం బడ

యుండు నప్పటప్పటికి నవీననాటకంబుల రసయుక్తంబుగఁ బ్రయోగించి వజ్రనాభుని వశవర్తిగాఁ జేసికొని తమ్ము వరించినపద్మగంధులతో వనవిహారజలక్రీడావినోదంబులఁ గాలయాపనంబుఁ జేయుచుండఁ బ్రభావతికి గర్భోత్పత్తిచిహ్నం బంకురించి క్రమంబుగ నవమాసములు గడచినయనంతరం బొక్కశుభలగ్నంబునఁ దేజోవిరాజితుం డగునొక్క కొమరుండు గలిగిన, నాతనికి ప్రభావంతుం డని నామకరణంబుఁ జేసి యతిరహస్యంబుగ నంతిపురియందు రక్షించుచున్నంత చంద్రవతీగుణవతులును గ్రమంబున నవమాసంబులు గడచినయనంతరంబున నొక్కసుముహూర్తమందు సకలలక్షణలక్షితు లగుకుమారులం గన వారలకుఁ గ్రమంబుగ చంద్రప్రభుం డనియు, గుణవంతుం డనియు నామకరణంబులఁ జేసి భద్రంబుగఁ బెంచుచుండ వారును నానాట నల్లారుముద్దుగఁ బెరుగుచు విద్యావినయవివేకసంపన్నులై ధనుర్విద్యావిశారదులై వరలుచుండ వజ్రనాభుండు వారల సమాచారంబును దాదులమూలంబున విని యుగ్రుండై సభాసదులం గలయం జూచి “దానవముఖ్యులారా! కంటిరా! కాలవిపరీతక్రమంబు. ముచ్చు లెవ్వరో దానవాంతఃపురద్రోహంబున కొడిగట్టిరి! ఏమి వారికండకావరము! దండధరునివాతఁ బడి యైనను దప్పించుకొన నొప్పును గాని నాకరటఁబడి తప్పించుకొనిపోఁగలరే? వినాశకాలము ప్రాప్తించుటచే నిట్టికార్యంబునకు సాహసించిరి. ఎందుఁ బోఁగలరు? సుర లైనయెడ నేఁడు నాకమునకు బ్రళయము సంభవించిన దని నమ్ముఁడు. నాగకులజు లైన పాతాళంబు పాడైన దని తలంపుఁడు. నరు లైనచో వారిపొట్లు నక్కలకును కుక్కలకును గూడ నుండఁబో దని యెంచుఁ” డని ప్రతాపంబులం బలుకుచు తలవరి యగు భీమబలుని రావించి “నీ వేగ యంతఃపురద్రోహు లగుతుచ్ఛులఁ బ్రాణంబులతోడం బట్టి తె” మ్మని యానతిచ్చుటయు నాతండు వోయి రాకుండినఁ గ్రమంబున దండనాయకుని దళవాయిని నంపి పోయినవారి రాకఁ గానక పదతాడితభుజంగంబువడువున రోఁజుచు తనలోఁ దా నిముడక కార్చిచ్చువిధంబున మండిపడుచు పోయినవారు వారలఁ దోడ్కొనిరా కుండిన వారిసిరంబులం గొట్టి కోటగుమ్మమునకుఁ గట్టింతు నని శపథంబు చేసె. అనంతరంబు వజ్రనాభుండు కోపాటోపంబునం గను లెఱ్ఱవాఱఁ దనతమ్ముఁ డగుసునాభునిం బిలిపించి సైన్యంబును సమకూర్చి రథతురగమాతంగంబులతోడం గదలి సేనానాయకుల బహువిధంబుల హెచ్చరించుచుఁ గన్యకాభవనప్రాకారంబు చుట్టుముట్టుకొనిరి. అప్పుడు తమవిడుదులలో నున్నప్రద్యుమ్నగదసాంబులు మన మీయెడ నంతఃపురప్రవేశంబు

